శ్రీరస్తు.

# రాజశేఖరవిలాసము.

కవిసార్వభౌమ

కూచిమంచి. తిమ్మకవి ప్రణీతము.





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1924.

# విజ్ఞప్తి

ఈ "రాజశేఖరవిలాసము (భల్లాణచరితము)"ను రచియించిన కవి "అభినవ వాగనుశాసన, కవిసార్వభౌమ" బిరుదముల నందిన కూచిమంచి తిమ్మయ. ఈతఁడు తనకృత్యపత్యముల నన్నిటిని పిఠాపురపుఁగుక్కుటేశ్వరస్వామి పేరఁ బెట్టి, పేరఁ బెట్టికొనిన తన బహుజన్మ దురిత కళంక పంకమును గడిగికొని యనపాయ మైనయశఃకాయమును నిలుపుకొన్న మంత్రికులాలంకారుఁడు. ఇక్కవి "సర్వపురమాహాత్మ్య" మనునొక్కగ్రంథమును పిఠాపురోపకంఠమున నున్న శ్రీభావనారాయణస్వామి కొసఁగి తనయద్వైతమతిని వెల్లడించినను మొత్తముమీఁద శివభక్తితత్పరుఁడే యనవలయును. ఇతఁడు కౌండిన్యగోత్ర పవిత్రుఁడైన కూచిమంచి. గంగనమంత్రి పుత్త్రుఁడు. తిమ్మన పౌత్త్రుఁడు. బయ్యన ప్రపౌత్త్రుఁడు. తల్లి లచ్చమ. గొట్టిముక్కల. రామయ్య కూఁతురు బుచ్చమ్మ యీతనిధర్మపత్ని. సింగన్న (రాజన్న), జగ్గన్న, నూరన్నలు తమ్ములు. జగ్గన, సింగన, నరసన్నలు పిన్నతండ్రులు. ఇతనికి వీరమ్మ, పాపమ్మ యను నిద్దఱు మేనత్తలుగూడఁ గలరు. ఈతనికి శైవమతరహస్యముల నుపదేశమిచ్చినగురువు దెందులూరి. లింగనారాధ్యుఁడు. ఈయనకు గ్రంథరూప మైనసంతతియె కాని యౌరసులు లేరని వినుకలి. ఇతఁడు క్రీ. శ. పదునేడవశతాబ్దాంతమున జనించి పదునెనిమిదవశతాబ్దాపరార్ధముదాఁక జీవించియుండెననికొందఱును, ఇంకను గొంచెము పూర్వుఁడే యని కొందఱును దలఁచెదరు. ఈయన గోదావరీమండలమునందలి పిఠాపురసంస్థానములోఁ జేరినకందరాడకుఁగరణముగానుండెనఁట. ఈయింటిపేరిటివా రిప్పటికిని పిఠాపురముచెంత నున్న చంద్రమ్మపాలెమున నున్నారని వినుచున్నాము. ఇయ్యనఘుఁడు నిరు

పేదవై యుండి తనపవిత్రజీవితమును గడపె నని కొంద ఱందురు. కాని యది యంత చర్చాసహముగాఁ దోఁచదు.

కవనముసొంపు.

ఈతనికవనము గంగాప్రవాహమువలె నిరర్గళప్రసారమై ద్రాక్షాపాకప్రచురమై రసోత్తరమై రసానుగుణపాకభూయిష్ఠమై వెలయుచున్నది. ఈయనకవనముంగూర్చి సమకాలీనుఁడును సంబంధియుఁ బ్రౌఢ కమనీయ కవయిత్ర్యతముఁడు నగు నేనుఁగు. లక్ష్మణకవి

"క. హాటకగర్భవధూటీ
లాటనచలితాంఘ్రినూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మాకూచిమంచి తిమ్మయమాటల్,"

అని సభాముఖమునఁ బొగడె నఁట.

ఈతని కిట్టి రసోత్తర మగుకవితాధోరణి యలవడుటకు

"ఈయనయక్షరాభ్యాసమునాఁడు తల్లి యీతని కభ్యంజనము సేయుచో నెత్తిని జమురు పెట్టి యంతలోఁ గార్యాంతరమున మనసు దగిలి పోయి యాపనిఁ జక్కఁబెట్టుకొని వచ్చునంతలోఁ గుక్కుటేశ్వరస్వామి యీబాలు ననుగ్రహింపఁ దలఁచి వృద్ధబ్రాహ్మణరూపమునఁ బొడసూపి యిరువదిగనుపులచెఱకు నొక్కదానిం దెచ్చి యిచ్చి యదృశ్యుఁడు కాఁగా నతఁ డాచెఱకుగడను భక్షించుచుండిన నదిచూచి కొంచెమెచ్చుతక్కువగా నీతనియీడువాఁడెయగు నీతనితమ్ముఁడు జగ్గన యాచెంత నాడుకొనుచున్నవాఁ డాచెఱకు నొడిచికొని యాతఁడు దినఁగా మిగిలిన పదిగనుపులను దా భక్షించెనఁట. దానం జేసి యాయిరువురకును నిక్షురసోపమ మగుకవితాధార కల్గెను."

అని యొకకథఁ జెప్పెదరు.

ఇది కల్పితమే యైనను కాకున్నను నీతనికవిత యిక్షురసోపమ మని పొల్చిన పోలిక యెంతయు హృద్యముగా నున్నది.

ఈతఁ డెంతగొప్పప్రబంధమునేని మిగుల వేగముగాఁ బూరింపఁ జాలెడివాఁడఁట. అందును దనచరమకావ్య మగుశివలీలావిలాసమును

ముప్పదియొక్క దినములలోననే పూర్తికావించితి నని కవియ చెప్పికొన్నాఁడు. ఇది యతిశయోక్తి యని కొందఱమతము కాని యితఁడు పద్యములు పలుమాఱు విమర్శించి నెరసు లేఱి వంకలు దీర్చి యపూర్వకల్పనామృతముల నింపి మెఱుఁగిడియ కాని వెలువరింప మను నియమము గలవారిలోఁ జేరఁడు. గావున మన మంతగా సంశయింపఁ జనదు. ఇదిగాక యీదినములలోఁ బ్రవీణు లగుకొందఱు మహాకవులను పోటిపెట్టికొని తాము వారలకంటె మిన్నలమని చెప్పుచు కడుపుకక్కుఱితికి లోనై సింగములు చిఱుతపులులు మొదలుగా ఘోరములైన బిరుదవుఁబలకల ఱొమ్ముల వ్రేలఁగట్టుకొని వీథులవెంటఁ బరువులు వాఱి బలిగుడు కూయుచున్న, శతావధాన, పరశ్శతావధాన, సహస్రావధాన, అతిసహస్రావధాన నిపుణంమన్య భీషణ చాటుకవి కవిశార్దూలముల సాహసకార్యములఁ జూచువారికి తిమ్మన యొకనెలలో రెండాశ్వాసముల ప్రబంధము వ్రాసె నన్న వింతగాఁ దోఁచదుగదా?

ఈతని కృతులు.

(1) రుక్మిణీపరిణయము మేము ముద్రించినాము.
(2) సింహాచలమాహాత్మ్యము
(3) నీలాసుందరీపరిణయము మాచే ముద్రింపఁబడెను.
(4) అచ్చతెనుఁగురామాయణము మేము ముద్రించినదే.
(5) సారంగధరచరిత్రము } ఈ 2 ను చక్కనివ్రాఁతప్రతులు
(6) సాగరసంగమాహాత్మ్యము } న్నచోఁ బంప వేఁడెదము.
(7) రసికజనమనోభిరామము ముద్రించియే యున్నాము.
(8) సర్వలక్షణసారసంగ్రహము
(9) సర్పపురమాహాత్మ్యము [గద!
(10) కుక్కుటేశ్వరశతకము. 92 పద్యములదనుక ముద్రించితిమి
(11) శివలీలావిలాసము ముద్రించియున్నాము.
(12) రాజశేఖరవిలాసము (భల్లాణచరితము) ఇదిగో

ఇంకను నముద్రితము లైనయీతనిగ్రంథము లెందేని దొరకినచో నలవియగునంతవఱ కీరీతిని నిర్దుష్టములుగా ముద్రించి సహృద

యులకుఁ గాన్కవెట్టికొందుము. ఉన్నచో దయమీఱఁ బంపుఁ డని భాషాభిమానులఁ బదింబదిగఁ బ్రార్థించుచున్నాము.

ఇంకొకమాట.

కొందఱు తలఁచినట్లీ గ్రంథ మీతని ప్రథమప్రయత్న మగుట చేతనో మఱి యే హేతువుననో కాని దీనియందు గవిత్రయేష్టములు కాని ప్రయోగము లందందుఁ జూపఁబడియుండుటయు కాక రేఫద్వయ సాంకర్యమును దఱచు గానంబడియెడిని. లక్షణగ్రంథమును సైత మొనర్చి ప్రథితుఁడైన యిక్కవి పేర నిట్టి గ్రంథ ముండుట కేమి కారణమో బహుజ్ఞు లగుదోషజ్ఞు లీతనిగ్రంథము లామూలాగ్రముగ శోధించి యీతనిమతమును లోకమున కనుగ్రహింతురుగాక.

నరాంకితము సేయమి,

తన కవితామహామంత్రశక్తిచే నెల్లరను రంజింపఁ జేసి బహుజనాదరమును బడసి విశేషముగా నప్పటి పిఠాపురపురాజగు మాధవరాయనిచేఁ గవిసార్వభౌమబిరుద మిచ్చి గౌరవింపఁబడినవాఁ డయ్యు నిక్కవి తనకబ్బముల నొక్కఁడేని నరాంకితము సేయఁడయ్యె. మఱియు నట్లు సేయుటనుగూర్చి

"క. పనిపూని తుచ్ఛభోగం, బునకై కొఱగానిజనులఁ బొగడుట యెల్లన్
గనుఁగొన నిహపరదూరం, బని తలఁచి వినిర్మలాంతరంగుం డగుచున్.

చ. విను మఖిలేశ మర్త్యులకు వేడుకఁ గావ్య మొసంగి ధాత్రిపై
నొనరఁగ సౌఖ్యసంపదల నుద్ధతులై సుకవీంద్రు లుందు రా
ర్యనికరవంద్య నీ విహపరంబుల సౌఖ్య మొసంగుసామి వం
చును మది నెంచి నీకు సరసుల్ విని మెచ్చఁ బ్రబంధ మిచ్చెదన్."

(రాజశేఖరవిలాసము.)

క. నృపులకుఁ గావ్యం బొసఁగిన, నపవర్గం బిడఁగఁ గలరో యటు గాకున్నన్
ద్విప తురగ భూష ణాంబర, తపనీయాదికముచేతఁ దనుపం గలరో.

సీ. ద్విజపుంగవులకుఁ బ్రవేశింపఁగారాని పృథుగృహాంతరములఁ బ్రేమ నుండి
కృతియంతధర్మపద్ధతు లెవ్వి యెఱుఁగక ధరణిపై నడువఁ బాదములు లేక
కుక్షింభరుల్ చేయుమంత్రులు చెప్పినటు మీఱక నటించుచు ద్విజిహ్వకలును గలిగి
వితతంబుగా వక్రగతులచేఁ బొదలుచుఁ బూని యేప్రొద్దును బున్న రనుచు

గీ. గాఢరోషవిషానలోద్గారిఘోర, వక్త్రములు గల్గి దుష్టదవస్థ లగుచుఁ
జెలఁగు చుండెడు భోగిరాజుల భజింపఁ, గుటిలతరబుద్ధి నెవ్వాఁడు కోరఁగలఁడు.
(సింహాచలమాహాత్మ్యము)

ఈరీతిని ప్రసంగము వచ్చినప్పుడెల్లఁ బలుతావుల నందందు నిందించియుండెను.

## కథాసంగ్రహము.

“ఇందలికథాంశ మిప్పటి మనతెలుఁగునాటనున్న యారాధ్యులను శైవమతప్రవిష్టులలో మిగులఁ బావనముగా వాడుకొనఁబడు భల్లాణునిచరిత్రము. ఇదియామతమువారు పలువురచే గద్యపద్యద్విపద దండకాదిరూపములఁ బలుతెఱఁగుల రచియింపఁబడి వాడుకలోనున్నది.

సింధుకటకాధీశ్వరుఁడును శివభక్తుఁడు నగుభల్లాణుఁ డనురాజు తనగురువుననుమతి వడసి ఇష్టదాన మనునొక వ్రతముం బూని జంగములకు నేది యడిగిన దానినెల్ల నిచ్చెద నని శపథముచేసెను. అంత నీవృత్తాంతము విని నానాదేశములనుండి విభూతిరేఖలు మెఱయ, రుద్రాక్షసరములు వ్రేల, కొమ్ముచెంబులు బట్టుకొని, పిడికంటలు వాయించుకొనుచు, శంఖములూఁదుకొనుచు, జింకతోళ్లు దర్భాసనములు దగిలించికొని, ఆఱుపింజలమడతనీర్కావిధోవతులు గట్టుకొని కోలఁదికి మీఱు జంగాలురాఁగా రాజువారినందఱ నిష్టప్రదానముచేఁ దృప్తులఁగావించుచుండెను. అంతనీవృత్తాంతమును నారదువలనవినిసంతసించితనభక్తినిమహిమ నరయఁగోరి శంకరుఁడు కైలాసమునుండి తరలి జంగమవేషధారియైవచ్చి యారాజుంగాంచెను. రాజును నత్యంతభక్తితో నాజంగమేశ్వరు నారాధించఁగా నాతఁడెద్దియుఁగోరక తనకుఁ బదువుఁదనమే జీవనముగాఁ గల లంజె నిమ్మని కోరి, యది యత్యంతానుచితమని రాజెంతబోధించినను నాదొంగజంగము వినఁడయ్యెను. ప్రతిజ్ఞాభంగభయభీరు వగురాజును నాతని వేశ్య నొసఁగనొప్పికొనియూరెల్ల వెదకినను నాయీశ్వరునిప్రేరణచే నొక్కసానియు లభించదయ్యెను. అంత రాజు ఖిన్నుఁడై యెటులైన మాట దక్కించుకోవలె నని తనభార్యను బతిమాలి యాపెను వేశ్యంబోలెఁ గైసేసి యాతనికొసం

గెను. టక్కరిజంగమురూపున నున్నశివుఁడును వానిసత్యసంధత్వమునకును భక్తితత్పరత్వమునకును సాహసమునకును గడునలరి, యాతనికి నిజరూపు జూపి యనుగ్రహించి యారాజశేఖరుని వానియిరువురు భార్యలతోఁగూడ బాంధితోఁ గైలాసముఁ జేర్చి వానికిఁ బ్రమథాధిపత్య మొసఁగెను.''

అనునీకథను మనతిమ్మన ప్రబంధముగాఁ గొన్నివర్ణనలు పెంచి వ్రాసెను. ఇక్కవియొక్కయు రాజశేఖరునియొక్కయు దేశకాలాదులం గూర్చిన విశేషములను దఱచి తెలిసికొనునంశము చదువరులకే విడిచి యిఁక నీతని శైలీప్రదర్శనార్థము కతిపయపద్యము లిందలివి చూపఁబడును.

## పురవర్ణనము.

మ. శశికాంతోపలజాలనిర్మితమహాసౌధాగ్రభాగోల్లస
ద్విశదాబ్జారిముఖీజనాంచితముఖావిర్భూతమందస్మితా
తిశయప్రస్ఫుటకౌముదీముదితహృద్దేశానిశోద్యచ్చకో
రశకుంతావళి గ్రాలి తనర్చుఁ జెలువారన్ దత్పురం బెంతయున్.

మ లలనల్ తత్పురిసౌధవీథులను డోలాకేళిచే నుండి తా
రలబాలార్కుని మింటఁ జూచి తమపాదాబ్జద్యుతిం బోలరాఁ
గలకెందమ్మి యటంచుఁ బాదములఁ ద్రొక్కన్ దంతముల్ రాలి య
ట్లలరెం గాదె సహస్రపాదుఁ డనుపే రావాసరస్వామికిన్.

చ. మరకతరత్నసంఘటితమానితకుడ్యకదంబజాలకాం
తరములనుండి వే వెడలు తద్ఘనసారపుధూపధూమముల్
పరువడిఁ జూచి నీలఘనపంక్తు లటంచు నటించు నెంతయున్
గుఱుతుగ మేదినీస్థలినిఁ గోర్కెలచే శిఖినీసమూహముల్.

## గిరివర్ణనము.

చ. చని కనిరొ న్నిలింపమునిసంతతభవ్యయశోవిశాలమున్
సనకసనందనప్రముఖసాధుగణస్తుతిమూలము న్నృపా
వనతరసానుదేశపరివర్తితకిన్నరకంబుకంధరీ
జనమృదుగానమోదితభుజంగమజాలము శ్వేతశైలమున్.

సీ. ప్రకటితసహకారపల్లవోద్యత్ఖాదనామోదపరభృతోద్దామరవము
ఘననితంబస్థలోద్గాఢలీలాలోలగీర్వాణకామినీగీతరవము

చారుమారుతపూరి తోరుతరాశేష కీచకానీకప్రకీర్ణరవము
సదమలవరఝరీసందోహసంరూఢ మానితఘూర్ణాయమానరసము
తే. సతతగంగాతరంగసంగతబలాక, చక్రసారసహంసాదిశకునిరవము
నొక్కటఁ జెలంగు మిగులఁ గర్ణోత్సవముగ, సురుచిరంబైనయమ్మహీధరమునందు.

## అ స్త మ య ము.

మ. సరసీజోద్భవరక్షకాకరుఁడు ఘస్రస్త్రీమణిం బ్రేమతోఁ
గర మింపొంద నలంకరించుటకుఁ వేగం గాఁచి తా నీటిలోఁ
బరఁగన్ ముంచినయట్టిమేల్మి యగుబల్బంగారపుంబూదె య
న్కరణిన్ భానుఁడు పశ్చిమాంబునిధిఁ జక్కం గ్రుంకె నొక్కమ్మడిన్.

మ. గురుపత్నిన్ వరియించుద్రోహి తనుఁ గన్గోరా దటంచున్ సుధా
కరురాకల్ మది నెంచి పద్మిని సువక్త్రంబుం గడు న్వంచె న
ట్లరయం బుణ్యవధూమణుల్ ధరణి నత్యంతోగ్రదోషాత్మునిన్
సరవి న్గన్గొన నొల్లకుందురుగదా చర్చింప నెంతేనియున్.

## చ ం ద్రుఁ డు.

సీ. అజుఁడు చకోరామరావనార్థము నిల్పఁ గోమరారునమృతంపుఁగుండ యనఁగ
బతిరాకకును నిశాసతి హారతిం బట్టు బాగైనరజతంపుఁబాత్ర మనఁగ
ఘనపాంథహృత్పద్మవనములు గలఁచంగఁ దవిలియేతెంచుచాదంతి యనఁగఁ
దొగకన్నె ముదమంది నగుఁగాక యనుచుఁ బ్రాజ్ఞగము చూపెడుదర్పణం బనంగ
తే. విశదకాంతుల నంతంత వృద్ధిపొంది, శీతకరబింబ మింపొందఁ జెలఁగి దిశల
సాంద్రతరముగఁ జంద్రికాసమితి దనరెఁ, గోరికలమీఱి కేరం జకోరకములు.

## వేశ్యాదూషణము.

ఆ. విటుఁడు లేనిరేయి వేదనఁ జెందుచు, నిదుర కంటి కెఱుఁగ నేర కుండి
కా సొసంగునట్టి కడజాతివాఁడైనఁ, గల్గఁ గోరు వారకాంత మదిని.

సీ. కడుఁ గురూపినైనఁ గందర్పనిభుఁ డంచు నభినుతి యొనరింతు రలఘులీల
నంత్యజన్మునైన నమలవంశజుఁ డంచుఁ బల్కుదు రెంతయుఁ బ్రౌఢి దనర
నతిమూఢమానసుం డగుమానవునినైన సరసుఁ డటంచురు సరభసమున
బ్రహ్మహంతకునైనఁ బరమధార్మికుఁ డంచు గణుతింతు రెపుడును గ్రమముతోడ
తే. నెన్నఁ గల్గిననీతివిహీనునైనఁ, దవిలి సద్వృత్తనుం డంద్రు తమకు నొక్క
వీసమైనను గాసైన వీడెమైనఁ, జేతి కొసఁగినచో వెలచిగురుఁబోండ్లు.

ఉ. చిన్నెల వన్నెల న్వగలఁ జిత్రవిధంబుల ముద్దుమాటలన్
వెన్నెలనెన్నునవ్వులను వేమఱుఁ బిత్తరివాలుఁజూపులన్

సన్నల సైగల న్నిగుల జాణతనంబున వారకామినుల్
చెన్నుగఁ బల్లవప్రతతిచేత ధనంబులు దోఁతు రెప్పుడున్.

చ. పొలుపుగ నిన్నుఁ బాసి యొకపూఁట మహాయుగ మంచు నెంచువో
వలనుగ నీవు వన్నిటుల వంచనసేయఁగఁ బాడియే యిటుల్
దలఁపఁగ నీతియే యనుచుఁ దక్కుచుఁ బొక్కుచు నిక్కువంబుగా
పలుచినయట్లు మాయలను వారవధూటి భ్రమించుఁ బల్లవున్.

జంగాలు.

సీ. కక్షపాలలు పైఁడికట్లబెత్తంబులు శంఖసంఖ్యల మించుశంఖములును
పిడిగంటలును కేకిపింఛంపుఁగుంచెలు ఛత్రము లువ్వలితోళ్లు చామరములు
యోగదండంబులు యోగపట్టెడలును గండపెండేరము లుక్కుండలములు
తనువులభూతిపూఁతలు కావివస్త్రముల్ మేలైనరుద్రాక్షమాలికలును

తే. శ్వేతకేతనములు రుద్రవీణియలును, బాత్ర మగునట్టిరజతంపుఁబాత్రికలును
కేలుఁదామర బలుపైనశూలములును, మొలకబంగరుగిలుకుపావలును గలిగి.

సీ. అతులితవిమలపంచాక్షరీమంత్రంబు మించుకోరిక బఠియించువారు
తఱచుగా శైవకథారహస్యార్థము ల్మైతి శిష్యవరుల కేర్పఱచువారు
సారెసారెకు నమ శ్శర్వాయ రుద్రాయ పశుపతయే యని పల్కువారు
నడుగడుగునకుఁ గాహళాదిరవంబులు చెలఁగించుచును వేడ్క నలరువారు

తే. చిత్రగతులను గానంబుఁ జేయువారు, సరవితో గద్యపద్యముల్ చదువువారు
నగుచు గోటానుకోట్లొక మొగిని నడువ, సాగి రానేల యీనినచందమునను.

సీ. మల్లయ్య వీరయ్య మఱి విరూపాక్షయ్య జడముడిబసవయ్య శంకరయ్య
పిడిఘంటచిక్కయ్య భీమయ్య సోమయ్య శివ్వయ్య హరిణాంకశేఖరయ్య
మరులయ్య సంగయ్య మార్కొండలింగయ్య పర్వతనాథయ్య పశుపతయ్య
శరభయ్య రుద్రయ్య కరపాత్రిసిద్ధయ్య శితికంఠయోగయ్య శ్రీగిరయ్య

తే. విశ్వనాథయ్య వీరమాహేశ్వరయ్య, యాదిగాఁ బేరు గల్గి మహాత్ములయిన
జంగమస్వాము లారాజసముఖమునకు, సరగఁ జనుదెంచి రత్యంతసంభ్రమమున.

ఇటు లింతకంటెను సరసములైనపద్యము లెన్నియో యున్నను గ్రంథవిస్తరభీతిని వాని నుదహరింప మానితిమి.

చెన్నపురి.
7—1—1915. } వావిళ్ల. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

# రాజశేఖరవిలాసము.

## పీ ఠి క.

---



నగజాతనుద్యుతులు చెల్వమెఱుంగులుగా వియన్నదీ
ధ్వానము లెల్ల గర్జితకదంబముగా రజతాచలాంబరా
స్థాని జనించు శర్వజలదంబు కృపారసధార మీఱ మ
స్మానసబర్హి నెంతయు ఘనంబుగ సంతస మొందఁ జేయుతన్. 1

చ. కరిముఖుఁ గన్నతల్లి శశిఖండవిభూషణుమూర్తి రాణి భూ
ధరవరు ముద్దుపట్టి నిజదాసగృహాంగణకల్పవల్లి కి
న్నరగరుడోరగాద్యమరనవ్యకిరీటమణిప్రభాతివి
స్ఫురితపదాబ్జ యా త్రిపురసుందరి మాకు నభీష్ట మిచ్చుతన్. 2

ఉ. వల్లవపల్లవాధరు లవారితభక్తిని బాలుఁ డంచుఁ ద
మ్మెల్లనఁ బిల్చి యెంతయును మేలగు క్రొవ్విరిబోణ్లు సంగఁ దా
నొల్లక యల్ల కప్పికొని యుంచినబంతు లొసంగు మంచు భా
సిల్లుకుచంబు లంటుచు హసించు ముకుందుఁ డభీష్ట మిచ్చుతన్. 3

కమలజార్చితమృదుపదకమల లైన, కమల మాయింట నెప్పుడు కడుముదమున
నెలసి యభిలషితార్థముల్ గలుగఁ జేసి. చిరతరం బైనకృపను రక్షించుఁగాత. 4

ఎంచఁ దగునంచతేజిని, జంచలగతి నెక్కుజాణ సరసిజగర్భుం
బంచితమతిచేఁ దానొన, రించుంగావుతను మాకుఁ బ్రేమన్ శుభముల్. 5

సీ. వేదాదివిద్యల వెలయించుపూఁబోణి నెఱి భక్తతతిఁ బ్రోచు నీలవేణి
యురుకవిత్వప్రౌఢి నొనగూర్చుకళ్యాణి మహనీయపుస్తకమహితపాణి
నిఖిలగీర్వాణవర్ణితసద్గుణశ్రేణి నిజలోచనప్రభానిర్జితైణి
ఘనతరోత్తుంగసైకతసన్నిభశ్రోణి రాజీవభవునిగారాబురాణి

తే. సమదపికవాణి యవ్వాణి సంతతంబు, మదిని దైవార రచియించుమత్ప్రబంధ
మరసి దుర్దోషరహిత మానట్లుగాను, జిరకృపాస్ఫూర్తిఁ బరిపూర్తి చేయుఁగాత.

చ. పొలుపుగ నీశుకంఠమునఁ బూనినయట్టికపాలమాలికల్
వలనుగఁ జూచి గొప్పలుగ వండినయుండ్రము లంచు భ్రాంతి లో
పల జనియించి తుండమునఁ బట్టి వడిం దివియంగఁ జూచు వి
ద్యలగురుఁ డేకదంతుఁడు ముదంబున మత్కృతిఁ బ్రోచుఁగావుతన్. 7

చ రవి శశి భౌమ సౌమ్య సురరాడ్గురు భార్గవ మంద రాహు కే
తువు లనఁ బేరుఁ గల్గి యలతోయజగర్భసురేంద్రముఖ్యు లౌ
దివిజుల కెల్లకోరిక లతిస్థిరమానసు లై యొసంగుచున్
భువిని బ్రసిద్ధు లైనగ్రహముల్ మముఁ బ్రోతురుగావుతం గృపన్. 8

సీ. కచశైవలంబులఁ గటిసైకతంబుల గొమరారునక్షిజకోకములను
లాలితబాహుమృణాళనాళంబుల నిరుపమలోచనేందీవరములఁ
గమనీయతరపాదకహ్లారదళముల మానైన దరహాసఫేనములను
బంధురకరతలపంకేరుహంబుల వరవళీవీచికావ్రాతములను
తే. భాసిలుచు నుండు గిరిజావిలాససరసి, నమరఁ గ్రీడించుగిరిశహంసము మదీయ
దురితనీరంబు దిగనాడి నెరిని సుకృత, దుగ్ధములఁ గైకొనెడుఁగాతఁ దూర్ణగతిని.

సీ. ఆశాంతవిదితపుణ్యశ్లోకు వాల్మీకు నఖిలశాస్త్రాగమాభ్యాసు వ్యాసు
భాసురకవితాప్రభవభూతి భవభూతిఁ జారుతరాతియశోరుఁ జోరు
వీరారిభుజగమయూరు మయూరుని బంధురలవపుష్పబాణు బాణు
నసమవిద్వన్మనోహర్షుని శ్రీహర్షు సారవాక్యక్రియాశ్లాఘు మాఘు
తే. కలితవిద్యాసముల్లాసుఁ గాళిదాసు, బుధజనానందకరముఖాంభోజు భోజు
మఱియు గీర్వాణకావ్యనిర్మాణచతుర, లగుకవీంద్రులఁ బ్రార్థింతు నగణితముగ.

మ. రమణన్ నన్నయభట్టు దిక్కమఖి నెఱ్ఱాప్రెగ్గడ న్భాస్కరుం
గ్రమ మింపొందఁగఁ బోతనాహ్వయుని లోకఖ్యాతుఁ ఱాజిష్ణుపూ
డమరేశున్ ఘను భీమసత్కవిని దధ్యం బొప్ప శ్రీనాథము
ఖ్యమహాంధ్రాంచితకావ్యకల్పకుల నేఁ బ్రార్థింతు నెల్లప్పుడున్. 11

సీ గురుతరకౌండిన్యగోత్రవిఖ్యాతుండు బయ్యనామాత్యుఁ డేభవ్యతాత
నిరతాన్నదానవర్ణితయశస్సాంద్రుండు తిమ్మనసచివుఁ డేధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సింగన్నయు నరసన్న యనుమువ్వు రేమంత్రియనుఁగుఁదమ్ము
లలరఁ దిమ్మన్న రాజన్న జగ్గన్నయు సూరన్న యేమంత్రిసుతవరేణ్యు
తే. లానరవీరమ పాప మేఘనునిసహజ, లతిపతివ్రత లక్ష్మి యేచతురరాణి
యట్టి శ్రీకూచిమంచి వంశాబ్ధివిధుని, మజ్జనకు నల గంగనామాత్యుఁ దలఁతు. 12

క. ఛందమునుం గావ్యాదుల, చందము నింతైన నెఱుఁగ సతతము విద్వ
ద్బృందంబులకృపఁ గవితా, సందర్భం బొగి నొనర్తు సాహసవృత్తిన్. 13

చ. ఎనయఁ బ్రసూనదామ మెవ రేక్రియఁ గూర్చిన నందుఁ గల్గువా
సనలకుఁ గాదె మానవులు సంతసమందుదు రుర్వి నట్టిపా
వనతరశంభుభక్తి యనువాసనకు న్మది మెచ్చి సత్కృతిం
గనుఁగొని తప్పు లెన్నక తగం గరుణింపుఁడు సత్కవీశ్వరుల్. 14

వ. అని నిఖిలవిబుధ విబుధ వినుతిం గావించి మఱియు నిష్టదేవతాప్రార్థనంబు జేసెద.

సీ. శ్రీమదిరీంద్రజాచిత్తసరోహంస హంససహస్రదివ్యప్రతాప
తాపసానేకసంతతరక్షణాధ్యక్ష యక్షేశసఖ దక్షయాగహరణ
రణరంగరిపునాశ రజతాచలనివాస వాసవార్చితపాదవనజయుగళ
గళమూలభూషణలలితహాలాహల హలధరానుజసన్నుతార్ధనాంగ

తే. యంగసంభూతమథన సత్యప్రచార, చారణామరపోషణసతతవిభవ
భవ విరూపాక్ష యోగిహృత్పద్మపీఠ, పీఠపురికుక్కుటేశ కిల్బిషవినాశ. 16

సర్వలఘుసీసము.

తరుణశశిధరణ సువితరణ భయహరణకర యరుణ సరసిరుహనిభ చరణయుగళ
మదనమదమథన ఘనకదనతలవిజయ గిరివదన జగదవన కరివదనజనక
వనజభవదమన పురదనుజకులశమన మునిమనుజసురవరద ప్రతిదినవిలసిత
బహుళతరవిభవ రిపుగహనదవదహన పటువిహగపతిగమననుత మహితచరిత
ధరణిరథ తరణిశతసదృశ హరత్రినయన, గరళగళ ధనదసఖ శుభద గగనచికుర
వరసుగుణనికర మృదుహృదయ శరధిశరధి, యురగవరభరణధరపరమపురుష గిరిశ. 17

క. దుర్గాధినాథ దివిజని, వర్గార్చితమృదులపాదవనరుహయుగళా
గర్గాదిమునిసన్నుత, భర్గా శ్రీకుక్కుటేశ భవ్యవిలాసా. 18

చ. విను మఖిలేశ మర్త్యులకు వేడుకఁ గావ్య మొసంగి ధాత్రిపై
నొనరఁగ సౌఖ్యసంపదల నుద్ధతులై సుకవీంద్రు లుందు రా
ర్యనికరవంద్య నీ విహపరంబుల సౌఖ్య మొసంగుసామి యం
చును మది నెంచి నీకు సరసుల్ విని మెచ్చఁ బ్రబంధ మిచ్చెదన్. 19

ఆ. తప్పు లున్నయెడల నొప్పులుగా నెంచి, పూని కావ్య మొనరఁ బూర్తిచేసి
కరుణమీఱ మాకుఁ గామితార్థములెల్ల, ఘనత నొసఁగి యేలుకొను గిరీశ. 20

క. అని విన్నవించి యాతని, ఘనతరకరుణావిశేషగౌరవమున నే
నొనరించెద నవ్విభునకు, జను లెల్లను బొగడఁదగిన షష్ఠ్యంతంబుల్. 21

క. ధీరునకు భక్తజనమం, దారునకు సురారిమదవిదారునకు మహో
దారునకు నఖిలజగదా, ధారునకు నఘౌఘవారిదసమీరునకున్. 22

క. సోమునకు రజతభూధర, ధామునకు సుదంచితాహిదామునకు నయో
ద్దామునకుఁ బ్రకటసద్గుణ, ధామునకున్ మౌళిశీతధామున కెలమిన్. 23

క. భవునకు శోషితసరసిజ, భవునకు నగణితసద్విభవునకు గౌరీ
ధవునకు వృషభేశ్వరసైం, ధవునకు గిరిబాంధవునకు ధవళాంగునకున్. 24

క. శూలికి విమలదయాసం, శీలికి గజదైత్యచర్మచేలికిఁ బురని
ర్మూలికిఁ బరిపాలితదివి, జాళికి నతహృత్పయోరుహాళికి భక్తిన్. 25

క. స్థాణునకు సురుచతుర్భుజ, బాణునకు జితప్రసూనబాణునకు బుధ
త్రాణునకు నిరతపోషిత, బాణునకున్ సత్యవాక్యపారీణునకున్. 26

క. నరకిన్నరవిద్యాధర, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వసురా
సురపూజితచరణునకును, హరిణాంకనిభప్రకాశుఁ డగుపశుపతికిన్. 27

క. భృంగిరిటనాట్యరతునకు, సంగరవిజయునకుఁ బాణిసారంగునకున్
గంగాధరునకు నబ్ధిని, షంగున కుర్వీరథునకు జగదధిపతికిన్. 28

క. యక్షాధీశ్వరసఖునకు, నక్షీణసత్కృపాకటాక్షునకు గణా
ధ్యక్షప్రియునకు విదళిత, దక్షాధ్వరునకును ధర్మతాత్పర్యునకున్. 29

క. హరునకు గాంచనధరణీ, ధరకోదండునకు మృత్యుదర్పహరునకీ
శ్వరునకుఁ బీతాపురమం, దిరకుక్కుటలింగమునకు దివ్యాంగునకున్. 30

వ. అనంతసాష్టాంగదండప్రణామంబులు సమర్పించి యద్దేవతాసార్వభౌమునకు నంకి
తంబుగఁ దత్కృపాతిశయమున నాయొనర్పం బూనినయట్టి రాజశేఖరవిలాసం
బునకుఁ గథాప్రారంభం బెట్టి దనిన. 31

## క థా రం భ ము.

ఉ. శ్రీకరలీలఁ దొల్లి మునిసింహు లనేకులు నైమిశాటవిం
బ్రాకటరీతి సూతుఁ గని పల్మముఁ బ్రార్థనఁ జేసి యెప్పుడున్
లోకములందు యోగిజనలోలుఁ డుమాపతి తత్కథావళుల్
చేకొని పల్కినన్ వినినఁ జేకుఱు సౌఖ్యము లెట్టివారికిన్. 32

సీ. అసమానఘోరదుఃఖారణ్యములకుఁ బ్రజ్వలితాగ్నికీలలు శంభుకథలు
ఘనతరాఘౌఘాంధకారంబునకు లసజ్జలజాప్తబింబముల్ శంభుకథలు

గాఢామితోగ్రదుష్కర్మోరగములకు సమదమయూరముల్ శంభుకథలు
అపమృత్యుముఖ్యదోషాంభోధరములకు జంఝానిలంబులు శంభుకథలు
తే. సజ్జనస్తోత్రపాత్రముల్ శంభుకథలు, సకలసంపత్కరంబులు శంభుకథలు
శాశ్వతైశ్వర్యయుక్తముల్ శంభుకథలు, సవనఫలదాయకంబులు శంభుకథలు 33
తే. గిరిశకథలందు నీవు నేర్పరివి మున్ను, శంభునకు వేశ్యగాఁ బ్రియసతి నొసంగి
యతనికారుణ్యమునకుఁ బాత్రత వహించినట్టిమనుజేంద్రుకథఁ జెప్పవయ్య మాకు.
క. అనవుడు సూతుఁడు మునులం, గనుఁగొని వెస నిట్టు లనియె గౌరీశుకథల్
వినిపించెద నని పూనఁగ, జనులకుఁ దరమగునె యోగిసంఘములారా! 35
శా. వాణీశామరవల్లభాదు లగుగీర్వాణుల్ నిజంబొప్ప న
య్యేణాంకార్ధవిభూషణుం దెలియఁగా నింతేనియుం జాల రీ
క్షోణిన్ మానవుఁ డెట్లు నేర్చు దృఢభక్తుల్ గొంద ఱాచక్రభృ
ద్బాణుం గాంతురు సత్కథావళులు నిత్యంబుం బ్రశంసించుచున్. 36
క. ఘనుఁ డగుపినాకిచరితలు, వినయవివేకజ్ఞుఁ డగుచు విలసిల్లెడుసూ
తునికిం దెలిసినవిధమునఁ, బనివడి యితరులకుఁ దెలియఁబడు నెట్లరయన్. 37
క. ఘనశైలంబులు ముంచెడు, ఘననిధిలో నోడ నిలిపి వడి నీఁదెడు మ
ర్త్యనికరణి భక్తియను నా, వను గిరిశకథాసుధార్ణవం బీఁదఁ దగున్. 38
తే. అట్లు గావున నతనిపాదాబ్జయుగము, భక్తితోడుత మది నిల్పి ప్రకటగతిని
మీర లడిగినకథ లెల్లఁ గోరికలర, నెఱుఁగఁ బలికెద వినుఁ డని యిట్టు లనియె.
క. శ్రీకరమై రిపుజనహృ, ద్భీకరమై త్రిభువనప్రథిత శివమతర
త్నాకరమై యనవరతశు, భాకర మై సింధుకటక మనుపురి వెలయున్. 40
మ. శశికాంతోపలజాలనిర్మితమహాసౌధాగ్రభాగోల్లస
ద్విశదాబ్జారిముఖీజనాంచితముఖావిర్భూతమందస్మితా
తిశయప్రస్ఫుటకౌముదీముదితహృద్దేశానిశోద్యచ్చకో
రశకుంతావళి యై తనర్చుఁ జెలువారన్ దత్పురం బెంతయున్. 41
చ. అరయఁగ నప్పురిం గనకహర్మ్యతలంబులఁ గేళిసల్పుసుం
దరులయొయ్యారముల్ గని ముదంబున నచ్చరలెల్ల మెచ్చి భా
సురగతిఁ గాన్కలంపిన ప్రసూనపుదండ లనంగ నెల్లెడం
దఱచుగ రత్నతోరణకదంబము లందము మీఱు నెప్పుడున్. 42
మ. లలనల్ తత్పురిసౌధవీథులను డోలాకేళిచే నుండి తా
రల బాలార్కుని మింటఁ జూచి తమపాదాబ్జద్యుతిం బోల రాఁ

గలకెందమ్మి యటంచుఁ బాదములఁ ద్రొక్కన్ దంతముల్ రాలి యు
ట్లలరెంగాదె సహస్రపాదుఁ డనుపే రావాసరస్వామికిన్. 43

తే. నాగరులు మేన నలఁదినవ్యాచంద, నాగరుల సౌరభానిలం బానుచున్న
చంచరీకాళులో యనుసరణిఁ బొదలుఁ, బురివితానాంచలాంచితసురపమణులు.

చ. మరకతరత్నసంఘటితమానితసౌధకదంబజాలకాం
తరముల నుండి వే వెడలు తద్ఘనసారపుధూమధూమముల్
పరువడిఁ జూచి నీలఘనపంక్తు లటంచు నటించు నెంతయున్
గుఱుతుగ మేదినీస్థలిని గోర్కెలచే శిఖినీసమూహముల్. 45

మ. నెల యవ్వీటను గోటచాటుఁ జనుచో నీ టొప్పు నర్కోపమో
జ్జ్వలపంకేరుహరాగరత్నరుచివ్యాప్తిం బ్రకాశించుని
వ్వలిచెంతన్ బరిఘాంతరాంబుజతతుల్ వ్యాకోచభావంబుచే
నలరుం బున్నమఱేలు తన్మణిరుచుల్ హంసాళులన్ భ్రాంతిచేన్. 46

ఉ. గట్టిగ వెండిబంగరపుగట్టులె యిల్లను విల్లుఁ గాఁగఁ జే
పట్టియు భిక్షుకుం డిరుగుభర్గుని జేటివిభూతియంచుఁ బె
న్గట్టుల మించువిత్తములఁ గ్రక్కున వెచ్చము చేయుచుండు ర
త్నపట్టణమర్త్యసంఘములు ధన్యవిభూతిఁ జెలంగి యెప్పుడున్. 47

క. వేడుక నజాతో వాదం, బాడఁ బులకితాంగు లగుదు రాపురిలోనం
బాడబులు దురితజలనిధి, బాడబు లని జగములెల్లఁ బ్రస్తుతిసేయన్. 48

క. మాయనియాకారముఁ బలు, మాఱును నిరసించురాకుమారులు నీటన్
మా ఱెందు లేక పడిఁ బరి, మాఱుతు రరివరులఁ దృణముమాఱుగ నెపుడున్. 49

క. ధనదుఁ డనుపేరుమాత్రము, తన కబ్బెంగాక పిలిచి ధన మెవ్వరికి
చ్చెను యతుఁ డంచు నెంచుచు, ధన మిత్తురు బుధులఁ బిలిచి తత్పురివైశ్యుల్.

క. ధరణీసురాంఘ్రిసేవా, నిరతులు శ్రీకంఠభక్తినిపుణులు రిపుకుం
జరసముదయహర్యక్షులు, సురుచిరయశు లందుఁ గలుగుశూద్రజనంబుల్. 51

సీ. పలనొప్పు నీదండ వలె నింతి మా కన్న దండ గావలె నేని యుండు కొనుము
కనుఁగొని యొద బంతు లోనర నిమ్మిపు డన్న గోరంటబంతులఁ గోయకొనుఁడు
మారుబేరము లింక మాకెట్లమరు నన్న మరుమాట మేలగు మాయెడలను
నను మోవిచివురనకును వెల యెంతన్నఁ బ్రియము మంచు దీనికిఁ బెనఁగఁబడునె

తే. యనుచు దముఁ జేరి నెఱదంటతనము మీఱఁ, బలుకునలకోడి కాంద్రకుఁ బ్రతివచనము
లొసఁగుచును బువ్వులమ్ముచునుందు రందు, నందముగ నెప్పుడును గొందఱిందుముఖులు
సీ. అలకంబు లలరించి తిలకంబు లొగి ఫాలఫలకంబులను ముద్దుగులుక దిద్ది
యందంబు లగుమంచిగంధంబు లెసకాడ నానందంబుతో గుబ్బలందు నలఁది
సింగారముగ మేల్మిబంగారుతొడవులు పొంగారువేడ్కచేఁ బొసఁగఁ దాల్చి
బలువైనవిలువచేఁ జలువైనసన్నంపువలువలు రింగులు వారఁ గట్టి
తే. యనంగభవకేళిఁ గోరి దాయంగ వచ్చు, పల్లవులమానసంబులు పల్లవింపఁ
బొందుమీఱంగ విహరించుచుందు రెపుడు, వారకామిను లందు నవారితముగ. 53

శా. శుంభద్విక్రమరూఢిచే బలుమఱుఙ్ శోభం బ్రకాశించున
జ్జంభద్వేషణుచేతివజ్రము నమఙ్ శంకించి చంచత్కృపా
రంభుం డావిభుచెంతఁ జేరినమహీధ్రశ్రేణు లక్కైవడిఙ్
గుంభీంద్రంబులు గల్గియుండు నెపుడుఙ్ గోటానకోట్లప్పురిన్. 54

చ. కుఱుతుగ నప్పురిం గలుగు ఘోటకసంఘముతోడ నెంతయుఙ్
బరువిడ నోడి వేగ హరిణంబులు వాయునిశాధినాథ శం
కరులను జేరి రైన నధికం బగు వైరము దీఱ్పలేక యా
కరణిన యుండెఁ దథ్య మిది కాదన వానికి నట్టులేటికిన్. 55

తే రాజహంసప్రభలచేత రాత్రి పగలు, కుముదకమలాళి హెచ్చుచుఁ గొమరుజూప
రాజహంసప్రతతులచే రమ్యమైన, సరసు లలరారు నవ్వోట సరసులలర. 56

సీ. అసదృశఫలపల్లవాహారలాలసశుకపికాదివిహంగశోభితములు
చంచత్ప్రసూననిష్యందన్మరందాభినందితసుందరేందిందిరములు
సతతవిలాససంచారనారీజనరమణీయగీతవిరాజితములు
సకలశ్రమాపనోదకభూరివిస్తారమానితచ్ఛాయాసమన్వితములు
తే. వకుళసహకారచంపకాశ్వత్థపూగ, నారికేళకపిత్థజంబీరపనస
కేతకీబిల్వముఖ్యభూజాతయుతము, లున్నతములొప్పు నప్పురియుపవనములు. 57

సీ. లలి బృహస్పతు లందు నలరు విప్రోత్తము లైనటి కల్పకము లందుఁ దరువులెల్లఁ
గామధేనువు లందుఁ గల గోగణములెల్లఁ బొసఁగ నచ్చర లందుఁ బువ్వుఁబోండ్లు
వలనొప్ప నుచ్చైశ్శ్రవంబు లందు హయంబు లైరావణము లందు వారణములు
గంధర్వవరు లందు గాయకానీకంబు లల వైజయంతు లందుల గృహంబు
తే. లభవనామజపంబె యమృతసేన, గాఁగ సురలోకసుఖము మందె కల్గియుండు
రాజజంభారి భళ్యాణరాయవిభుఁడు, కరుణఁ బాలించు తత్సింధుకటకమునను. 58

సీ. అడఁడు స్వప్నంబులందైన నెప్పుడు పాటిఁ దప్పి యసత్యభాషణములు
చూడఁ డొక్కెడనైన సురుచిరసౌందర్యవరవధూజనముఖపద్మములను
వీడఁ డెంతటి యవివేకచిత్తుల నైన శరణు వేఁడినభీతజనవితతుల
నోడఁ డత్యుగ్రరణోర్వీస్థలులనైనఁ జలితుఁ డై శాత్రవసంఘములకు
తే. నతఁడు రాజేంద్రమాత్రుఁ డే మతిఁ దలంప, నర్థిదారిద్ర్యతిమిరార్కుఁ డమితయశుఁడు
భవ్య శివదేవరాయ భూపాలసుతుఁడు, భూరివిభవుండు భళ్యాణభూధవుండు. 59
తే. ధర్మగుణకాండములె చాలఁ దనకుఁ దోడు, గాఁగ నరులను రక్షించు గణన లేక
ధర్మగుణకాండములె చాలఁ దనకుఁ దోడు, గాఁగ నరులను శిక్షించు గణన లేక.
సీ. అలచందురునియందు గలకందుఁ గని ముందు పలుచందమూల నింద లలి నొనర్చి
ఘనలీలలను కూలిగళమూలమున నీలమును బోలురుచిజాలమును హసించి
తగ నీరిపై భూరి తరహారి యగుచీరఁ గని సారెకనుఁ గేరి వినుతిమీటి
పికవాణి యగువాణి పృథువేణి గలపోణిమిని జాణతనమున మించనాడి
తే. కుందమందారవిశదారవిందచంద, నేందుమణిహారతారకాహీరవార
ములఁ దిరస్కృతి యొనరించుఁ జలముమిగుల, పరసతోషిత నమ్మహీవరునికీర్తి. 61
సీ. కోరినయప్పుడే కురియును వర్షంబు భూమి ఫలించు నద్భుతముగాఁగ
మొదవులు పాలిచ్చు మూఁడువేళలయందు విడువక కాచును వృక్షతతులు
నెరి నపమృత్యువు నెలుఁగ రెవ్వారైనఁ జోరరుగ్బాధలు సోఁకు టరిది
జలతృణోపేతమై విలసిల్లు ధారుణి నిత్యోత్సవము లొప్పు నిఖిలదిశల
తే. జనులు కలనైనఁ గలహంబుఁ గనుట లేదు, జాతిభేదంబు దప్పక జరుగుచుండు
జలరుహాప్తాన్వయాంభోధిచంద్రుఁ డగుచుఁ, దనరుభళ్యాణవిభుఁ డేలు ధరణియందు.
తే. సతతపుణ్యవ్రతలు గుణోన్నతలు పతికి, హిత లశేషజగజ్జననుతలు భాగ్య
వతులు రూపున మారుబరతులు సుమతు, లతులసౌజన్యయుత లిర్వ రతనిసతులు. 63
ఆ. వారిలోన నగ్రవనజాక్షి చల్లాంబ, మఱియుఁ బిన్నపొలఁతి మల్లికాంబ
సవతు లెరుసు లేక సతతంబు మెలఁగుచు, సవతు లేక యుండ్రు సమ్మదమున. 64
సీ. కమనీయమేఖలాఘటితభూరినితంబ పోషితాశేషసద్బుధకుటుంబ
సుందరాస్యప్రభానిందితశశిబింబ మధురోష్ఠవిహసితమహితబింబ
చికురకోమలకాంతిజితమత్తరోలంబ కేవలతరకరుణావలంబ
యానావధానప్రహర్షితకాదంబ నిఖిలపాపౌఘావనీధ్రశంబ
తే. గురుజనానందకరలసద్గుణకదంబ, సేవకాభీష్టఫలదప్రసిద్ధసాంబ
శివచరణభక్తివాసనాంచితకదంబ, సతతసత్యవ్రతాలంబ చల్లమాంబ. 65

శా. ఆ చల్లాంబవిలాసవైఖరులు భాషాధీశ భోగీశులున్
వాచాప్రౌఢిని బల్కఁ జాలరల గీర్వాణాబ్జపత్త్రాక్షులం
దాచెల్వంబొకయింతయుం గలుగ కిట్లైనట్టి యాలేమతో
భూచక్రంబునఁ గల్గు నిందుముఖులం బోల్పంగ నీ డౌదురే? 66

చ. కలికిపదద్వయంబునకుఁ గ్రక్కున నోడినప్రిదఁ గచ్ఛపా
వళి తలఁ జూపఁ జాలక జవంబున లోఁతగు నీటిలోఁ బడెం
దలరఁగ నెఱ్ఱతామరలు దట్టపుకాంతికి నోడి తత్పదం
బులఁ బడి యెప్పుడున్ వదలిపోక భజించు నహర్నిశంబులున్. 67

తే. సకియజంఘాయుగంబుతో సాటిరాఁగఁ దలఁచియొదిరించిరోడి డెందమునబలియు
భీతిచేఁ గాదె పొట్టలు పిగులుచుండుఁ, గలమగర్భంబు లెల్లనుఁ గ్రమముతోడ.

క. కరిగమనతొడలతోడుత, సరివోలఁ దలంచి చూచి చక్కఁగ నరఁటుల్
పెరిగి జిగితఱుగుఁగా కటు, తర మగునే పిల్లపిల్లతరములఁ దమకున్. 69

క. కలికిపిఱుందుల కెన గాఁ, బులినము లిసుమంత లెటులఁ బోలెడు నొకచోఁ
దుల తుల యనుచుండెడు వే,దులఁ దుల యన నేల వానితో సరి యగునే. 70

తే. అతివనడలకు నోడి రాయంచతుటుము, లరయ నిలువెల్ల వెల్లనై యాత్మలోనఁ
దద్విరోధంబు సాధింపఁ దలఁచి కాక, కమలజుని మోవఁ దమ కేమి కారణంబు. 71

చ. చిరతరవిక్రమస్ఫురణచే సముదంచితకుంభికుంభముల్
పటియలు జేసి తత్ప్రశితభక్షణ సేయుమృగేంద్రకోటులా
గురుకుచసూక్ష్మమధ్యమునకుం దగ నోడి యదృశ్య మయ్యెఁ గా
కరయ గుహాంతరాళముల నట్టు వసింపఁగ నేల వానికిన్. 72

తే. లలనవళులెప్పుడును దారు నిలిచియుండు, నిలుకడయొకింతయును లేకచలన మొందు
చుండు నంచును బలుమాఱు నుల్లసమున, భంగత యొనర్చు జలధితరంగములకు. 73

చ. పొలఁతుకయారుతీ రలరఁ బొందుగ నాభి గుహా న్వసించుస
ల్లలితపయోధరద్వయమిళద్ఘనలేపన దివ్యసౌరభం
బులమలయాద్రిశృంగసముదంచితచంచలమందచందనా
నిల మనుచుం బయల్వెడలి నిల్చిననీలభుజంగమో యనన్. 74

చ. చలమునఁ జంద్రుఁ డేఁచఁగను జక్కన లాచెలిగుబ్బచన్నులై
పొలుపుగ నుద్భవించి మదిఁ బూనినసాధ్వస మెల్లఁ దీఱి త

ద్విలసిత నామధేయమున వేమఱుఁ జెల్వగునట్టిచంద్రస
మ్మిళితము లై వసించుఁ జెలిమిన్ మనసో యన నొప్పు నెప్పుడున్. 75

క. విరిచెండ్లు నిమ్మపండ్లును, గర మొప్పగు పసిడిగిండ్లు కరికుంభములున్
సరిగావా వరవర్ణిని, గురుకుచయుగళంబుతోడ గోరంతైనన్. 76

క. గళమునకు నోడి శంఖము, గళగళ మని పలుకుచుండెఁ గలకంఠంబుల్
పలుచందంబుల నయ్యె, గ్మలిసుస్వరమునకు నోడి మలినము లయ్యెన్. 77

సీ. వనజాక్షికెమ్మోవి కెనఁ బోల్పఁ దగు నని పల్కఁ దళాల్ గావె పల్లవములు
శుకవాణియధరంబునకు సాటి యౌనంచుఁ గీర్తింప బొల్గావె కెంపు లెల్ల
నెలనాగపెదవితోఁ దుల యంచుఁ బొగడంగ విలువ దేరునుగావె విద్రుమంబు
లింతివాతెఱతోడ నీ డనంగను గంధరహితంబు నగుఁ గాదె రక్తకంబు
తే. నరయ నెందులతోఁ బ్రతి యనఁగవచ్చుఁ,బలుచ నై తేనె లొలుకుచు విలువదెగక
సతతఘనసారసౌరభోన్నతులఁ దనరు, కంబుకంధర రదనాంశుకంబునకును. 78

క తలతల మనువజ్రంబులఁ, దళతళ మను నిందువదనదంతమరీచుల్
కలకల మనిరొదు రాచిలు, కలకలమనసుల్ గలంచుఁ గలికిమృదూక్తుల్. 79

ఉ. తామరసాక్షి వీనుగవ తా నవసంఖ్యల నెంచఁజాలుఁ ద
త్కామినితళ్కుఁజెక్కు లలకాముని చేతి మెఱుంగుటద్దముల్
సామజయాననాసికము సంపఁగిమొగ్గల నెగ్గులాడు నా
కోమలిలోచనంబులు చకోరగణంబుల నేలు నెంతయున్. 80

క. వనితారత్నంబునపుం, గనుబొమ లందమున మీఱుఁ గందర్పునిచేఁ
దనరెడి సింగిణివిండ్లో, యనుచున్ జను లెల్లఁ జూచి యభినుతి సేయన్. 81

మ నెరి నబ్జాహ్వయ మిర్వురందు నలర న్నిరేజతారేశు లా
తరుణీరత్నము ముద్దుమొగముచందం బంద వాదించుచో
సరసీజానళి యోడెఁ గా దని యొరుల్ చర్చింప సర్వోర్వికిం
గర మాహ్లాదము చేయుచంద్రుఁ గని ప్రుక్కన్ వాని కష్టేటికిన్. 82

క. నీలంబుల మృదుతరశై, వాలంబులఁ జారుచమరవాలంబుల స
ద్రోలంబమేచకాంబుద, జాలంబుల నేలఁ జాలు సఖిచికురంబుల్. 83

సీ. జలజాక్షినునుకురుల్ శైవాలలతికలు రాజాస్యవళులు తరంగతతులు
కలకంఠిలోచనంబులు గండుమీలు సుమగంధివిపులహాసములు నురువు

లతికకంఠము దక్షిణావర్తశంఖంబు భాహుచన్నుబ్బలు పర్వతములు
కామినీమణిజంఘికలు మకరంబులు చానపిఱుందులు సైకతములు
తే. గంధగజయానచరణముల్ కచ్ఛపములు, రమణిహారంబు లెల్లను రమ్యమణులు
తరుణి ఘననాభి సుడి యనఁ దనరుచుండుఁ, గావున విలాసజలరాశి యావెలంది.

వ. ఇవ్విధంబున ననన్యసామాన్యయౌవనసౌందర్యసద్గుణకదంబ యగుచల్లమాంబయు
నఖిలగుణంబుల నప్పరమపతివ్రతారత్నంబున కెనయం దగుముక్తికాదేవియుం దనకుఁ
బ్రియపత్నులుగా నభీష్టభోగంబు లనుభవించుచుండి యారాజపురందరుం డొక్క
నాఁ డాత్మగతంబున నిట్లని వితర్కించె నంత. 85

చ. సిరిగలనాఁడె మానవుఁ డశేషజగద్విదితంబు గాఁగ సు
స్థిరతర మైనకీర్తులను జెందుట మే లగు నట్టుగానిచో
సిరియును లేమియుం దలఁపఁ జీఁకటి వెన్నెలవాసి గాక యె
వ్వరికిని లేఁతప్రాయమును వార్ధకముం గురిగాదె మేదినిన్. 86

ఆ. ధనము గల్గియుండ ధర్మంబు సేయక, యున్న నదియుఁ బరుల కొదవుఁగాదె
తేఁటు లెల్లఁ గూడి తేనియఁ గూర్చిన, నొరుల కబ్బినట్లు లెఱుఁగుకొనిన. 87

తే. చెలఁగు చాశీతిలక్షలజీవరాసు, లందు జనియించి నరకంబు లనుభవించి
యంతమీఁదట మనుజుఁ డై యవతరించి, తేటపడఁగ సమస్తంబుఁ దెలిసియుండు.

ఉ. అట్టిమనుష్యదేహ మటు లబ్బినయప్పుడె భక్తిమీఱఁగా
గట్టులరేనియల్లుని జగద్విభు నీశ్వరు నిందుశేఖరుం
గట్టిగఁ బూజసేయుచును గౌతుకలీలలఁ గీర్తికాంతఁ జే
పట్టి తుదిం దిరం బయినభవ్యపదంబును జెంద మే లగున్. 89

క. అడిగినవస్తువు లారులకుఁ, గడు వేడుక నొసఁగి ముజ్జగంబులకుం దా
నొడయఁ డగునట్టిశంభునిఁ, దడయక హర్షింపఁ జేతుఁ దథ్యము మీఱన్. 90

క. ఈవిధమున ప్రతికార్యముఁ, గావింపఁ దలంచుచోటఁ గావలయుఁ దగ
న్పావనతర గురుదీక్షను, ధీవరు లగువారలకు నధికతరభక్తిన్. 91

క. పొసఁగ గురుచరణయుగళము, వెసఁ గాంచినయపుడె తొలఁగు వెఱచియఘంబుల్
విసవిసఁ బవనుఁడు జనమున, విసరిన విడి పాఱుజలదవిసరముభంగిన్. 92

మ. వనజాతప్రభవాండమండితజగద్వ్యాకీర్ణుఁ డై యొప్పుభ
ర్గునిఁ గాంచన్ గురు నాశ్రయింపవలయుం గుంభాంతరాపూర్ణద
ధ్యనిశోద్యన్నవనీత మారయఁగఁ దథ్యం బొప్ప నెల్లప్పుడున్
ఘనమందారము నాశ్రయించుకరణిన్ గౌతూహలప్రక్రియన్. 93

సీ. బహుజన్మజనితమౌ పాపాబ్ధికిని నావ చర్చింప సద్గురుచరణసేవ
కమనీయపుణ్యలోకప్రాప్తికిని త్రోవ చర్చింప సద్గురుచరణసేవ
చిరతరైశ్వర్యలక్ష్మీప్రదం బగు క్రేవ చర్చింప సద్గురుచరణసేవ
దుష్కర్మరుక్సంహతులకు నౌషధసేవ చర్చింప సద్గురుచరణసేవ
తే. వనజసంభవముఖ్యగీర్వాణబృంద, ములకుఁ గానంగ రానిశంభునిపదాబ్జ
దర్శనం బాత్మఁ గోరినధన్యమతుల, కిరవలరుశేవ సద్గురుచరణసేవ. 94
క. అని తలంచి యాక్షణంబున, దినకరకులజలధి శీతదీధితి యగున
జ్జనపాలవరుఁడు కౌతుక, మునఁ దనరారుచును వేగమునఁ బయనంబై. 95
సీ. గములు గూడుక కురంగములచందమున వేగమునఁ బారెడుతురంగములతోడ
నరుఁకచ్చెరువుగాఁ దరలి యాడెడుపెద్దగిరులఁ బోలెడుగంధకరులతోడ
నుతులు సేయఁగఁ జాలుగతులఁ జెల్వలరారు నతులశతాంగసంహతులతోడ
కుటిలారివరులఁ గోటులఁ జేసెడిమహోర్భటులు గల్గినవీరభటులతోడ
తే. హితులతో మాన్యు లగుపురోహితులతోడ, బుధులతోడను వంధిమాగధులతోడ
నతిరయఁ దక్కినపరివార మరుదుమీఱఁ, గొలువఁజనియె నిలాభర్త గురునికడకు.
క. అటు లరిగి కనియె నరపతి, పటుశైవకథారహస్యభాసురహృదయున్
ఘటితాఖిలజనకామున్, నిటలాక్షపదాబ్జభక్తినిధి నాచార్యున్. 97
క. కనుఁగొని వినయంబునఁ బద, వనజంబుల కెఱఁగి లేచి వసుధాధిపుఁ డొ
య్యన ముకుళితకరతలుఁడై, వినుతింపఁగఁ జూచి గురుఁడు వెస నిట్లనియెన్. 98
మ. క్షితినాథోత్తమ! నీకు నీసతులకున్ క్షేమంబె? నీమంబుతో
సతతంబుం బ్రజ నేలుచుండుదువె? నీసైన్యంబు లెల్లం బలో
న్నతి నొప్పారుటఁ జేసి శత్రువరులన్ మర్దించి యిష్టార్థముల్
కుతుకం బొప్పఁగ ధారుణీసురులకుం గొంచింప కీఁ జూతువే? 99
క. పరమాత్మభేదనుండును, జిరమతిమంతుండు హితుఁడు శిష్టవ్రతుఁడున్
వరకులజుండునుఁ గరుణా, నిరతుండును నైనమంత్రి నీయెడఁ గలఁడే? 100
క. దేవాధీశ్వరునకు మును, జీవుఁడు దా మంత్రి యగుటచే ఘనుఁ డయ్యెం
గావున విభవముఁ గోరిన, భూవిభునకు మంత్రివరుఁడు భూషణ మరయన్. 101
ఉ. స్నానము సేయునీమమును శంభుపదార్చనఁ జేయుమర్త్యుఁడున్
వానలఁ గల్గుసస్యమును వారిరుహాహితుఁ డుండురాత్రియున్
మానిని గల్గుసౌఖ్యమును మంత్రివరేణ్యుఁడు గల్గ నొప్పున
మ్మానవనాథురాజ్యమును మానుగఁ జేటువహించు నెంతయున్. 102

వ. అట్లగుటం జేసి నేర్పరి యగుమంత్రి గలరాజు రిపుల జయించి యక్షీణ రాజ్య సుఖంబు లనుభవించుం గావున సప్తాంగబలంబులకన్నం బెద్ద యగుమంత్రాంగబలంబు పరిగ్రహించితివే యని మఱియు భవదాగమనప్రయోజనంబును సవిస్తరంబుగాం దెల్పు మనిన నద్ధరావల్లభుం డిట్లనియె. 103

క. జనసుత! మీ రాజ్ఞ యొసంగ, గినరీతి నొనర్చినాండ కృతపుణ్యా! భవ
ఘ్నకరుణను నే నిచటికిం, జనుదెంచుట మీపదాంబుజంబులం గొల్వన్. 104

సీ. గురునాథ! జంగంబు గోరిన వస్తువు నెద్దియైన ముదంబు నివ్వఁటిల్ల
నొసఁగి జగంబులం దసమానకీర్తులం జెంది గిరీశుఁ డానంద మొందు
నట్టు గావించెద నని తన నూహించి వ్రతము గైకొనఁ గోరి వచ్చినాఁడ
మీర లిందుల కిచ్చు మెచ్చి యాదరమున నీక్షింప నిప్పుడే దీక్ష యొసఁగి

తే. భూతి నొక్కింత నొసటిపైఁబొట్టుబెట్టి, పాదతీర్థంబు మూర్ధంబుపైనిం జల్లి [డు.
యాజ్ఞదయ సేయుమనుటయునతనిఁజూచి, యద్భుతంబొందియాచార్యుఁడనియెనపు

ఉ. ఓనరనాథ! భూరిసుగుణోన్నత! నీవిపు డాత్మలోపలం
బూనినకార్య మాపననభుగ్వరకంకణుఁ డైన నిష్ఠతోఁ
దా నొనరింపఁజాలఁ డన ధారుణిలో జను లెట్టు నేర్తు ర
ట్లైనప్రయోజనంబునకు నర్హమె నీ కిటు లూహసేయుటల్. 106

ఉ. ఇప్పటిభక్తిమార్గము నరేశ్వర! చిత్తమునందు నెప్పుడుం
దప్పక నిల్పఁజాలుదువె? తద్విధ మెంతయు దుర్లభంబు నీ
కిప్పగిదిం బొసంగు! వసుధేశ్వరు లెక్కడ! చెప్పఁ జోద్యమై
యొప్పువ్రతంబు లెక్కడ? మనోభవరూప! యెఱుంగఁ బల్కుమా. 107

క. ఇచ్చెద రనువోటికిఁ గడు, వచ్చెద రాస్యలు చెలంగి వారికిఁ గృపతో
నిచ్చల్ గలుగుపదార్థము, లొచ్చెం బించుకయు లేక యొసఁగఁగ వలయున్. 108

ఉ. ఆరయఁ బుత్త్రి నైన సతి నైనఁ దనూభవు నైనఁ గాంచనా
గారము లైనఁ జెల్వ మగుకాయ మొకింతుకఁ గోసి యైన యా
ధారుణి నైన నిట్టిశపథం బొనరించినచోట నేటుగాఁ
గోరిక యెంతలే దనక గొబ్బున నీవలయుం బుధాళికిన్. 109

చ. ఘను లరుదెంచి యీఁ దరము గానిపదార్థము లాసతోడఁ గో
రినయెడ నీయఁజాలక ధరిత్రిపయి న్నగుబాటుఁ జెందుకం

పైని విను భూవరా! మునుపటింబలె నూరక మేరతో వసిం
చినదియె మేలుసుమ్ము శశిశేఖరు నెమ్మదిఁ బూజసేయుచున్. 110

క. అదియును గాకొకరొడ గుడి, వదలి వెసన్ శిష్యవరుఁడు వ్రతభంగముచేఁ
బొదలినయప్పు డొకించుకఁ, గొదువంటుఁ జుమీ! తలంప గురునాథునకున్. 111

ఉ. నావుడు రాజశేఖరుఁడు నవ్వలరన్ గురుఁ జూచి పల్కె నో
దేవ! భవత్ప్రసాదమున ధీరత మీఱఁగఁ దద్వ్రతంబు పృ
థ్వీవరులెల్ల నెన్నఁగను వేడ్కనొనర్చెద సంశయంబు మీ
భావమునందు నిల్పక కృపామతి నానతియీవె శీఘ్రతన్. 112

మ. అరవిందోదరతుల్య పుణ్యయుతకార్యారంభసంరంభవి
స్ఫురితాక్షీణదృఢాంతరంగ మితరంబుల్ గోరుటల్ నేర్చునే?
చిరగీర్వాణతరంగిణీవిమలవీచీజాలలీలానిరం
తరసంతోషిత రాజహంస మిరవొందం జేరునే వాఁగులన్? 113

వ. అదియునుం గాక. 114

సీ. సతి నమ్మి మును హరిశ్చంద్రభూనాథుండు సత్యంబు నిలుపఁడే జగమెఱుంగఁ
దనతండ్రియానతిఁ దప్పక హర్షించి రాజ్యంబు వదలఁడే రాఘవుండు?
శిబిచక్రవర్తి వాసిగఁ దొల్లి డేగకుఁ గొనకొని దేహంబు గోసియీఁడె?
ఘనత మీఱఁ బరోపకారార్థము దధీచి తా నస్థు లొసఁగఁడే తనువు విడిచి?
తే. వారలెల్లను బృథ్వి నున్నారె యిపుడు?, సలలితం బగు ప్రఖ్యాతి వెలసెఁగాక
వినుము గురునాథ! యిఁకబెక్కులనగ నెందు, కటులసత్కీర్తి నిలిపెదనవనియందు.

చ. జలనిధు లింకినన్ ధరణిఁ జంద్రుఁడు గ్రుంకిన వేధ జంకినన్
జలజలమంచుఁ జుక్కలు కృశంబయి డుల్లిన భూమి క్రుంగినం
గులగిరులెల్లఁ బెల్లగిలి కూలిన దిక్కరులోలి మ్రొగ్గినం
బొలుపుగ నీవ్రతంబు పరిపూర్తి యొనర్తు శివుండు మెచ్చఁగన్. 116

వ. మహాత్మా! మీయనుగ్రహంబువలన మన్మానసంబు సంతోషించుచున్నయది మీ
రిందులకు సంశయింపక శీఘ్రం బానతీయవలయు నని ప్రార్థించిన. 117

తే. అన్నివిధముల నీమది నెన్ని చూచి, గట్టిగా గుడి నిలుపఁగలట్టులైన
భూమిపాలక! మాచేతిభూతి యంది, భూతనాథుని మెప్పింపు ఖ్యాతిమీఱ. 118

క. కరుణారసపూరితహృ, త్సరసిజుఁ డై యపుడు గురుఁడు జనపతినొసటన్
సరగున భూతి యొకించుక, తిరముగ నిడి యాజ్ఞ యొసఁగ దినకరకులుఁడున్. 119

క. శరణార్థి యగుచు శిరమున, గురుపదతీర్థంబుఁ జల్లుకొని సద్భక్తిం
బరివర్తించుచు నొయ్యన, మరలెం బురి కధికసంభ్రమం బలరారన్. 120

ఉ. అంతఁ గొలంత లేక బల మంతయుఁ జెంత ననంతవాజులన్
దంతుల నెక్కి యెంతయు నితాంతజవంబున నంతకంతకుం
బంతమునీఱ నింతలుఁగ బంతులుసాగి యొకింత రాఁగ భూ
కాంతుఁడు సొచ్చె నప్పురముకాంతలు సేసలఁ జల్లుచుండఁగన్. 121

చ. అలికులవేణు లెల్ల మణిహర్మ్యతలంబుల నిల్చి చెల్వగాఁ
గలువలు నాణిముత్తెములు గాఢముగాఁ బయిఁ జల్ల నవ్విభు
జ్జలజహితాన్వయుం డలరెఁ జారుతరంబుగఁ దారకాగణం
బులు బలుదిక్కులం గొలువఁ బొల్పగుచల్లనిచంద్రుఁడో యనన్. 122

తే. రమణఁ బళుకొత్త మేదినీరమణునకును, బసిఁడిపళ్లెరములను దీపముల నుంచి
రమణు లతనునికంఠహారమణు లనఁగ, నిచ్చ నలరుచు నారతు లిచ్చి రపుడు. 123

తే. ఇందుకాంతావళులభావ మెల్లఁ గఱఁగ, రాజుదయపర్వతమునుఁ జేరంగ నెఱిఁగె
నిందుఁ గాంతావళులభావ మెల్లఁ గరఁగ, రాజుదయపర్వతమును జేరంగ నెఱిఁగె.

వ. ఈచందంబునఁ బౌరసుందరీసందోహం బమందం బగునానందంబు డెందంబులం
గ్రందుకొన నందంద పయిం దొలంగించెడు కుందాది సుమబృందంబుల గందం
బులు పొందుగా హృదయారవిందంబునకు విందొనర్ప వందిమాగధులు ముందరసం
దడిగొని వినుతింప దివ్యదుందుభినాదంబులు చెలంగఁ గందర్పసుందరుం డగువ
వ్వసుంధరాపురందరుండు మందహాసం బొదవ నిజమందిరంబుం బ్రవేశించి తనయిం
దుముఖులుం దానును సుఖంబున వసించె నంత. 125

మ. సరసీజోద్భవరక్తకౌరవుఁడు ఘస్రస్త్రీమణిం బ్రేమతోఁ
గర మింపొంద నలంకరించుటకు వేగం గాంచి తా నీటిలోఁ
బరఁగన్ ముంచినయట్టి మేల్మి యగుబల్బంగారపుంబూదె యా
న్కరణిన్ భానుఁడు పశ్చిమాంబునిధిజక్కం గ్రుంకె నొక్కుమ్మడిన్. 126

తే. రాజు కువలయ మలరింప రాఁ దలంచు, టెంచి సమయాధికారి గట్టించినట్టి
భవ్యకల్హారతోరణపంక్తి యనఁగ, సాంధ్యరాగము విలసిల్లె సాంద్రముగను. 127

మ. గురుపత్నిన్ వరియించుద్రోహి తనుఁ గన్గొరాదటంచున్ సుధా
కరురాకల్ మది నెంచి పద్మిని సువక్త్రంబుం గడు న్వంచె న
ట్లరయం బుణ్యవధూమణుల్ ధరణి నత్యంతోగ్రదోషాత్మునిన్
సరవి న్గన్గొన నొల్లకుందురుకదా చర్చింప నెంతేనియున్. 128

సీ. విటులపై మదనుఁడు వెడలుచో దిక్కులఁ గ్రమ్ముపికాళిసంఘ మ్మనంగ
మిగుల నిశాకాంత మేలుసుం గిడుకొన్న లాలితనీలచేలం బనంగ
బద్మబాంధవునితోఁ బాసి వర్తించువాసరలక్ష్మి ఘనదుర్యశం బనంగ
నజుఁడు విష్ణుపదంబు నమరఁ బూజించినఁ బరఁగునిందీవరప్రతతి యనఁగ
తే. నవనిఁ దమ నెందుఁ జొరనీక దవిలె నంచుఁ, దపనుఁడపరాబ్ధిఁబడెనింక దాఁగ నేల
యనుచు గిరిగుహాలంగుండి యొనరవెడలు, కలుషతతి యనఁబర్వె దిక్కులఁదమంబు.

తే. పేర్మి రేఱేఁడు కుముదినిఁ బెండ్లియాడ, రమణఁ బఱతెంచు ననితిమిరమణి చదలు
మంగలంబున వేఁచినమంగళార్థ, లాజలవరుసఁ దార లల్లనఁ జెలంగె. 130

తే. దృఢతమోభూతబాధితదిగ్వధూటిఁ, బ్రోవఁ దత్కాలఘనయోగిపూన్కిఁ దెచ్చి
నట్టిబల్దివ్విటీ యన నబ్జవైరి, యురుతరశ్రీలఁ దా నంత నుదయ మయ్యె. 131

సీ. అజుఁడు చకోరామరావనార్థము నిల్పఁ గొమరారునమృతంపుఁగుండ యనఁగఁ
బతిరాకకును నిశాసతి పోరతిం బట్టు బాగైనరజతంపుఁబాత్ర యనఁగ
ఘనపాంథహృత్పద్మవనములు గలఁచంగఁ దవిలి యేతెంచుచాదంతి యనఁగఁ
దొగకన్నె ముద మంది నగుఁగాక యనుచుఁ బ్రొజ్నగముచూపెడుదర్పణంబనంగ
తే. విశదకాంతుల నంతంత వృద్ధిపొంది, శీతకరబింబ మింపొందఁ జెలఁగి దిశల
సాంద్రతరముగఁ జంద్రికాసమితి దనరెఁ, గోరికలమీఱె కేరం జకోరకములు.

వ. అయ్యెడ. 133

సీ. పట్టైనసిగలపైఁ బట్టుబొందులు జుట్టి వలిపెగుడ్డలఁ బొంక మలరఁ గట్టి
సొగసుగా నుదుటఁ గస్తూరిరేఖలు దీర్చి కడఁగి ముత్యాలచౌకట్లు గట్టి
కరములఁ బచ్చలకడియంబు లొగిఁ దాల్చి కంఠమాలికలు చొక్కమున నించి
చలువదుప్పటులు పైవలెవాటు గావించి కర మొప్పుచందనగంధ మలఁది
తే. మల్లెపూదండ లింపు శోభిల్లఁ బూని, పండుటాకులు కపురంపుబాగ లూని
పరఁగఁ జేపట్టి యొయ్యారిభామ లెసఁగ, విటులు విహరింపసాగి రవ్వేళ యందు.

చ. చెలు వగుపెన్నెరుల్ దళుకుఁజెక్కులు నిద్దపుముద్దుమోములుం
గులుకుమిటారిచన్గవలు గొప్పపిఱుందులు వాలుఁజూపులు
న్గిలకిలనవ్వులున్ మిగుల నే టగుగాటపుసూటిమాటలుం
గలిగి విటావళిం దిరముగా వలపింతురు వేశ్య లత్తఱిన్. 135

చ. చిలుకలతేఱునున్ జెఱకువిల్లును దేఁటినారియున్
బలుజిగురాకుబాలును వనప్రియసైన్యము పువ్వుదూపులున్

జెలఁగెడుమీనుటెక్కెమునుఁ జెన్నొదవ న్వెడలెన్ విటాళిపై
మలయమరుద్వసంతఘనమంత్రులఁ గూడి రతీశుఁ డయ్యెడన్. 136

క. పుండ్రేక్షుచాపమునఁ గడు, వేండ్రపుఁబువుటమ్ముఁ దొడిగి విరహిజనులఁ బె
క్కండ్ర నపుడేసె మన్మథుఁ, డెండ్రాయని యొరుఁడు తన్నెదురుటలేమిన్.

చ. బలములఁ బొఁజుదీర్చి నిజబాణపరంపర లెల్ల నేర్చి దో
ర్బల మరుదారఁ బేర్చి కడుబాగుగ శింగిణిఁ జేర్చి లీలతోఁ
బలుమఱు నేసి యార్చి విరబంభరవేణులఁ దార్చి నాథులం
గలయఁగఁ గూర్చె నోర్చి యలకాయజువైఖరి నేర్తురే! యొరుల్. 138

ఉ. కొమ్మ లనంగనొప్పుపుపుఁగొమ్మలఁ జేరి వినూత్నదివ్యగం
ధమ్ములఁ గేరి మోవి నమితమ్ముగు తేనియఁ గ్రోలి సోలి యా
ముమ్మరమైనకోడిచను మొగ్గలమీఁదను వ్రాలి చాల సౌ
ఖ్యమ్ములఁ దేలె లీలఁ బురుషావళి యన్ మధుపంబు లయ్యెడన్. 139

ఆ. అంతఁ గడఁకె నంత కొంతయుఁ డంగజాఁ, డరయఁ దనదుభక్తవరునిపురము
జనుల నేఁచు టెఱిఁగి సరగ వేజూచుకై, వడిని వేగుఁజుక్క వొడిచె దివిని. 140

లయగ్రాహి.
కుక్కుటము లెంతయును బెక్కు లగుదిక్కులను నిక్కి మద మెక్కి భువిపిక్కటిల మ్రోసెన్, జుక్కలును సోముఁడును గ్రక్కునఁదొలంగి రలజక్కవలు గేరె మరుఁడుక్కుచెడి పాఱెన్, జక్కఁగ విహంగములు జిక్కువడియున్నతమ టెక్కలు లలరించుకొని చొక్కముగఁ బల్కెన్, గ్రిక్కిఱిసి తేఁటిగము లక్కములరాజిపయిఁ బొక్కుచుఁ జరించెఁ దొగ లొక్కటముగాన్. 141

చ. అతులతరార్చు లెల్ల నలరారఁగ నెంతయుఁ గ్రోధచిత్తుఁడై
నతజనఘోరకిల్బిషవనంబులఁ గాల్పఁగ నాత్మ నెంచి శ్రీ
ధృత నరుదెంచినట్టి యలగంధవహోప్తుఁడొ యవ్విధంబునన్
ధృతి నుదయించె జంభరిపుదిగ్గిరిపై హరిదశ్వుఁ డంతటన్. 142

క. పురజనము లపుడు కడున, బ్బురపుంగోరికల నంతిపురములలోఁ గ
ప్పురపుఁ దూమము లిడి గో, పురములపైఁ గనకకుంభములు నిల్పి తగన్. 143

సీ. తీరుగా నాణిము త్తియపుఁబందిరు లిడి కలువలు నించి మేల్కట్లు గట్టి
గోడల నెల్ల రంగుగఁ జిత్తరువు వ్రాసి వేధులు దేవతావేశ్మములును

వింతగా నలరించి వృషభకేతనముల గీములయందెల్లఁ బ్రేమనునిచి
వీథులు జక్కఁగావించి చందనమునుఁ గస్తూరియునుగూడఁ గలిపి చల్లి
తే. యఖిలజనములు పురినెల్ల నమరఁజేసి, తప్పటికిమున్నె యొప్పౌలకుప్పలయిన
తనవధూరత్నములుఁ దాను ధరణివిభుఁడు, వేగమేల్కాంచి తత్కాలవిధులఁదీర్చి

ఉ. తానము లాడి నీమమున ధౌతపటంబులు గట్టి యంత సం
స్థానమునందు భర్మమణిసంఘటితం బగువేదిమీఁదటన్
భానుకులాగ్రగణ్యుఁ డగుపార్థివశేఖరుఁ డాత్మలోన నిం
పూనినవేడ్కతోడ శివపూజ యొనర్పఁగ సాగె నుబ్బుచున్. 145

సీ. ఆవాహనంబు వృషాధిపవాహున కాసనం బమలసింహాసనునకు
నర్ఘ్యం బనేకలోకాధారమూర్తికిఁ బాద్యంబు సుగుణసంపాద్యునకును
నిజభక్తి నాచమనీయ మీశ్వరునకు స్నానంబు వేడ్కతో స్థాణునకును
వస్త్రం బశేషగీర్వాణసన్నుతునకు బ్రహ్మసూత్రము పరబ్రహ్మమునకు
తే. గంధ మిభదైత్యదాననిర్గంధునకును, బుష్ప మశ్రాంతమునిజనపోషణునకు
ధూప మాననకాంతివిధూపమునకు, దీప ముష్ణాంశుకోటిప్రదీపునకును. 146

శా. నైవేద్యం బహిరాజకంకణునకుం దాంబూల మేపారఁ ద
ద్దేవేశార్చితపాదపంకజునకున్ ధీయుక్తి నీరాజనం
బావేశాత్మునకున్ సుమాంజలి రతీంద్రారాతికిన్ విస్ఫుర
ద్గ్రావస్థానునకుం బ్రదక్షిణనమస్కారంబు లర్పించుచున్. 147

సీ. మందారకుందారవిందనీలోత్పలబంధూకవకుళసౌగంధికములఁ
బ్రియ మొప్పఁ దులసికాబిల్వాదిమృదులతరోల్లసద్బహువిధపల్లవముల
ఘనసారచందనాగురుచారుగుగ్గులుకస్తూరికాదికవస్తువులను
దధిఘృతగోక్షీరమధురసనారికేళాంబువు లనెడుపంచామృతములఁ
తే. బోలుపు మీఱెడుకాంచనపుష్పములను, నాగవల్లీదళక్రముకభాగములను
సులలితాపూపసూపాన్నఫలతతులను, జనవరుఁ డొనర్చె నవ్వేళ శంభుపూజ. 148

వ. మఱియు గీత వాద్య నృత్తాది బహువిధానందంబుల నంబికారమణు నారాధించి యి
ట్లని వినుతింపం దొడంగె. 149

సీ. కలధౌతనగవాస! కరిచర్మకృతవాస! శరదిందునిభహాస! శరణుశరణు!
ఇనకోటిఘనదీప! కనకాద్రిపటుచాప! సనకాదినుతరూప! శరణుశరణు!
వరయోగిజనలోల! దురితాభ్రవాతూల! సురరాజవరపాల! శరణుశరణు
వినవంగరిపుభంగ! రమణీయధవళాంగ! చతురాగమతురంగ! శరణుశరణు

తే. సలిలతాంభోధితూణీర! శరణుశరణు!, శాశ్వతైశ్వర్యసంయుక్త! శరణుశరణు!
సాధులోకసురోర్వీజ! శరణుశరణు!, శరణు! విశ్వేశ! భూతేశ! శరణుశరణు!. 150

సీ. పొంకంబు గలమంచిజింక నంకంబుగాఁ గొంకక ప్రేమతోఁ జంక నిడికి
దిట్టతనంబుతో గట్టిగా సామేన గట్టులదొరముద్దుపట్టి నునిచి
వింతఁగా సికను బూబంతిగా జాబిల్లి నెంతయుసంతసం బెసఁగ నిలిపి
మేలైనయేనికతోలు శాలుఁగఁ బూని లీలతో ముమ్మొనవాలుఁ దాల్చి
తే. పొసఁగ భసితంబుఁ బూసి యాఁబోతు నెక్కి, గాలిమేఁతరిసొమ్ములఁ గడుధరించి
లచ్చిమగఁడును నలువయు మెచ్చిపొగడ, జగము లేలెదు నినుఁగొల్తు నిగమవినుత.

శా. నీరేజోద్భవముఖ్యులౌ సురమునుల్ నిన్బ్రస్తుతుల్ సేయఁగాఁ
దారొక్కింతయు నేర రంచును బుధుల్ తథ్యంబుగాఁ బల్కుచో
నోరాజార్ధకిరీట! మర్త్యుఁ డిఁక నెట్లోపుఁ బ్రశంసింపఁగా
గౌరీమానసపద్మషట్చరణ! శ్రీకంఠా! జగద్రక్షకా. 152

తే. శివశివా యని సన్నుతి సేయనేర, వినయ మొప్పారఁ బూజఁ గావింపనేర
మూఢుఁడను నన్నుఁ గృపఁజూడు మోదముతోడఁ, బార్వతీలోల సంతతభక్తపాల.

క. జయజయ పురదైత్యాంతక!, జయజయ శృంగారలీల! సదమలశీలా!
జయజయ నాకాధిపనుత!, జయజయ లోకాధినాథ! జయ పరమేశా! 154

వ. ఇట్లనేకప్రకారంబులఁ బ్రస్తుతించి తదనంతరంబ. 155

క. తరుణారుణాంశునిభభా, సురనవరత్నచయఖచితశోభితదివ్యా
భరణోజ్జ్వలాంగుఁ డయి యత్యురుతరచిత్రాంబరముల నొగి ధరియించెన్. 156

తే. ఆరయ రుద్రాక్షమాలిక లఱుత మెఱయ, ఫాలమున భూతిరేఖయు శ్రీల దనరఁ
పసిఁడిపావలు దొడిగి వైభవము చెలఁగఁ, గప్రపువిడెంబు సేయుచుఁ గౌతుకమున.

సీ. దివి పిక్కటిలఁ బెక్కుతెఱఁగుల నెడలేక భేరీమృదంగముల్ భోరుచెలఁగఁ
గంతునిచేతిచేమంతిబంతు లనంగ వంతుకెక్కినకళావంతు లాడఁ
దుంబురునారదాదులఁ దిరస్కృతి సేయు గాయకుల్ గీతముల్ కడఁగి పాడ
వందిమాగధులు చెల్వొంది ప్రస్తుతి సేయఁ జేరి భూదేవు లాశీర్వదింప
తే. రమణఁ బరిచారికలు ముందఱను బిఱుందఁ, బసిఁడిబెత్తులచేఁ బరాబరు లొనర్ప
రాజసంబున నంతఃపురంబు వెడలి, ఘనత సర్వేశుఁ డాస్థానమునకుఁ జనియె. 158

సీ. చాలుచాలునఁ జాలునీలంపుఁబగడంపుఁగంబము ల్మితి లేనికాంతిఁ దనర
గారుత్మతపుమణు ల్గదియించినట్టిమేల్మేడగోడలు సొంపుమీఱి యలర
నిందుకాంతములఁ బొల్పొంద నొనర్చిన సోపానములు వింతశోభ లెసఁగ
వెలలేనివజ్రంపువేదిక ల్చెలువాఱ గోమేధికపుగవాక్షులు చెలంగ
తే. నతులవైడూర్యపుష్యరాగాదినీల, రత్నవస్తువు లెంతయు రమణ మెఱయఁ
గ్రొత్తముత్తెఁపుబెత్తులు గొమలుమిగులు, కొలువుకూటంబునందునఁ గూర్మితోడ.

క. కురుమగధచోళమాధవ, కరహాటమరాటలాటకర్ణాటకఘూ
ర్జరయవనముఖ్యధరణీ, వరు లెల్లం గొలువ భూరివైభవలీలన్. 160

సీ. వేదశాస్త్రపురాణవివిధరహస్యము ల్వరుసతోఁ గవిబుధావళులు దెలుప
సంగీతనృత్తాదిసరసవిద్యాప్రౌఢి కడువేడ్క నర్థిసంఘములు నెఱప
శైవవైష్ణవజైనచార్వాకబౌద్ధశాక్తేయులు తన్మతక్రియలు సెప్ప
కరవాలశూలతోమరభిండివాలాదిశస్త్రపాతకులు ప్రశస్తిఁ జూప
తే. రమణు లిరుగడ వింజామరములు వీవఁ, గడఁగి డెబ్బదిరెం డగుఘననియోగ
ములఁ దవిలి రత్నపీఠాగ్రమునఁ జెలువుగఁ, గొలువుఁ గూర్చుండె మేదినీతలవిభుండు.

క. అతులితవిభవంబున నీ, గతిఁ గొలువున నుండి యచటఁ గలజనములకుం
గుతుకం బొప్పఁగ ధరణీ, పతి దా నపు డిట్టు లనుచుఁ బలికెం బ్రేమన్. 162

చ. వినుఁ డిదె యాదిగాఁగఁ బృథివిం గలజంగమకోట్లకెల్లనుం
గొనకొని సత్వదార్థములఁ గోరినయంతనె పూన్కితోడ లే
దనక రయంబుమీఱ ననయంబును నిత్తు నృపాధిరాజవా
హనునకుఁ బ్రీతిగాఁగ జగమంతయు మెచ్చఁగ నుత్సవంబునన్. 163

ఆ. ప్రజలకెల్లఁ దెలియఁ బ్రతిన గావించెద, నడుగకున్నవారి కరయ నొట్టుఁ
జేరి యాసతోడఁ గోరినవారల, కీయలేనివాని కిదియ యొట్టు. 164

క. అని పలికి సకలదిశలం, బనిపడి చాటింపఁ బనిచి బాగుగ మొగసా
లను గంట వ్రేలఁ గట్టిం, చెను జనములకెల్లఁ గడువిచిత్రము మీఱన్. 165

వ. ఇట్లు శపథంబు గావించి దిశలం జాటించినఁ దద్వృత్తాంతం బంతయు విని క్రమం
బున. 166

సీ. కత్తుపాలలు పైఁడికట్లబెత్తంబులు శంఖసంఖ్యల మించుశంఖములును
పిడిగంటలును నేకిపింఛంపుఁగుంచెలు ఛత్రముల్ బులితోళ్లు చామరములు

యోగదండంబులు యోగపట్టెడలును గంధపెండేరము లుఁ గుండలములు
తనువులభూతిపూఁతలు కావివస్త్రము లైన రుద్రాక్షమాలికలును
తే. శ్వేతకేతనములు రుద్రవీణియలును, బాత్ర మగునట్టిరజతంపుఁ బాత్రికలును
సేలుఁ దామరఁ బలువైనశూలములును, మొలకబంగరుగిలుకుపావలును గలిగి. 167

సీ. అతులితవిమలపంచాక్షరీమంత్రంబు మించి కోరికఁ బఠియించువారు
తఱుచుగా శైవకథారహస్యార్థము ల్మెఱి శిష్యవరుల కేర్పఱచువారు
సారెసారెకు "నమ శ్శర్వాయ రుద్రాయ పశుపతయే" యని పల్కువారు
నడుగడుగునకుఁ గాహళాదిరవంబులు చెలఁగించుచును వేడ్క నలరువారు
తే చిత్రగతులను గానంబుఁ జేయువారు, సరవితో గద్యపద్యము ల్చదువువారు
నగుచుఁ గోటానకోట్లొకమొగిని నడువ, సాగి రానేల యానినచందమునను. 168

సీ మల్లయ్య వీరయ్య మఱి విరూపాక్షయ్య జడముడిబసవయ్య శంకరయ్య
పిడిఘంటచిక్కయ్య భీమయ్య సోమయ్య శివ్వయ్య హరిణాంకశేఖరయ్య
మరులయ్య సంగయ్య మార్కొండలింగయ్య పర్వతనాథయ్య పశుపతయ్య
శరభయ్య రుద్రయ్య కరపాత్రసిద్ధయ్య శితికంఠయోగయ్య శ్రీగిరయ్య
తే. విశ్వనాథయ్య వీరమాహేశ్వరయ్య, యాదిగాఁ బేరు గల్గి మహాత్ము లయిన
జంగమస్వాము లారాజసమ్ముఖమునకు, సరగఁ జనుదెంచి రత్యంతసంభ్రమమున.

వ. ఇవ్విధంబునఁ బఱతెంచి నృపాలుం గాంచి. 170

శా. ఏరా! భూవర! మాకుఁ గాంచనతురంగేభాంబరాందోళికా
భూరిస్యందనమందిరోపవనసద్భూషామణిశ్రేణులున్
జేరెం గావునఁ బల్లెలున్ బశువులున్ లెక్కింప కర్థంబు మా
కేరా! కోరిక దీఱ మీఱ కిఁక నీ వెంతేనియున్ ధీరతన్. 171

క. పాలు పెరుఁ గిక్షురసమునుఁ, జాల ఫలరసములు దేనె శర్కర ఘృతమున్
మే లగుకజ్జంబులు నీ, వేళకుఁ దెప్పించరోరి వేగమె మాకున్. 172

మ. అనుచుం గోరినజంగమయ్యలకు నత్యానందచేతస్కుఁడై
మనుజాధీశ్వరుఁ డర్ఘ్యపాద్యవిధులన్ నన్వించుచుం గాంచనా
సనము ల్వెట్టి బహుప్రకారములఁ బూజ ల్చేసి యశ్రాంతమున్
ధనధాన్యాంబరముఖ్యవస్తువులచేత న్బ్రీతి గావించుచున్. 173

క. అడిగినవస్తు వొకింతయుఁ, దడయక యాక్షణమునందె తాత్పర్యముతోఁ
గడుణటి నొసఁగుచు భూపతి, పుడమిన్ బ్రతివాసరంబు బ్రోది యొనర్పన్. 174

క. జంగంబు లెల్ల నచట భు, జంగమరాజాంగదుని వెసం గొల్చుచు నో
జంగములై వసియించిరి, బంగరపుమఠంబులందు భాసురలీలన్. 175

వ. ఈక్రమంబున వర్ధరాధీశుం డతులితధర్మమార్గప్రచారుండై ప్రతిదినజంగమారాధ
న సేయుచుండె నని సూతుం డెఱింగించిన నైమిశారణ్యమహామును లట విూఁదికథా
వృత్తాంతం బెట్లని యడుగుటయును. 176

ఉ. హారతుషారహీరశరదభ్రనిశాకరతారకాబ్జడిం
డీరసురాళపారదపటీరవియత్తటినీసితాభ్రమం
దారసురేంద్రనాగకలధౌతసుధారససన్నిభోజ్జ్వలా
కార లసద్విహార సుమకాండవిదార! యుదార! శంకరా! 177

స్రగ్విణి.
చారుకారుణ్యవిస్తార! తారేశకో, టీర! దైత్యేభకంఠీరవేంద్రాదిబృం
దారకానీకమందార! సత్యవ్రతా, చార! గోరాజసంచార! గౌరీశ్వరా! 178

తురగవర్గనము.
ధరణిధరవరశరణ చిరశుభదాయకా హరిసాయకా
తరణిశశిశిఖినయన దురితవిదారణా! లయకారణా!
పరమపురుష హరిహయనుత! పురభంజనా! మునిరంజనా!
హర! గరళగళ! విమతదనుజభయంకరా! జయ శంకరా! 179

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాద లబ్ధ కవితా సామ్రాజ్య ధురంధర
ఘనయశోబంధుర కౌండిన్యగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్ర
బుధజనవిధేయ తిమ్మయనామధేయ ప్రణీతం బైనరాజశేఖరవిలాసం బనుకావ్యం
బునందు ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# రాజశేఖరవిలాసము.

## ద్వితీయాశ్వాసము.



రాజితాఖిలాగమ
పారగ! సురరాజమౌళిభాసురతరకో
టీరా! మణిరుచిరచరణ!
క్రూరాహితమదవిభంగ! కుక్కుటలింగా!. 1

వ. అవధరింపుము నైమిశారణ్యమహర్షులకు నిఖిలపురాణవ్యాఖ్యానవిఖ్యాతుం డగు సూతుం డిట్లనియె. అట్లు నిరంతరజంగమారాధనదీక్షితుండై యాత్మమావల్లభుండు వర్తించుచున్నసమయమున నొక్కనాఁడు. 2

సీ. ఘన మైనతనుకాంతిఁ గనుఁగొన్నచో శరద్ఘన మైనఁ దాఁకకే కదలి పాఱఁ
బొడ వైనజడలదీప్తులు సాంద్రతరబాలజలజాప్తరుచులతోఁ జెలిమిసేయ
నిండుచందురుఁ బోలునిటలభాగంబున రమ్యభస్మత్రిపుండ్రంబు మెఱయఁ
బవమానవశమునఁ బల్కుచేతివిపంచిగళరవంబునకు రాగంబు గూర్ప

గీ. మండితం బైనదండకమండలువులు, నలరుపటికంపుసరులు మృగాజినంబు
గల్గి యరుదెంచె నమ్మహీకాంతుకడకు, భూరిలీలాప్రచారుండు నారదుండు. 3

ఉ. వచ్చు టెఱింగి మానిజనవర్యు నెదుర్కొన నేగి మ్రొక్కి తో
డ్తెచ్చి యనర్ఘ్యరత్నరుచిదీపితపీఠమునందు నుంచి తా
హెచ్చుగ నర్ఘ్యపాద్యవిధు లిచ్చి కడు న్వినుతించి భక్తితో
నచ్చతురాస్యసూతికి ధరాధిపుఁ డిట్లని పల్కె నేర్పునన్. 4

చ. మునివర! సర్వలోకములముఖ్యుఁడ వీశ్వరభక్తిమార్గసం
జనితయశఃప్రకాశుఁడవు సంతతపుణ్యుఁడ వీవు మద్గృహం
బున కిపు డిట్లు రాఁ గనుట భూరిశుభంబుల కెల్లఁ దానకం
బనుదినభోగభాగ్యవిభవాతిశయంబుల కెల్ల మూలమున్. 5

క. అనఘ! మిముఁబోటిపుణ్యులఁ, గనుఁగొనుభాగ్యంబు మాకుఁ గల్గుటయెల్లన్
ఘన మగునిధిఁ గాంచినపే, దనుఁ బోలుటగాదె తలఁపఁ దాపసముఖ్యా!. 6

సీ. అనవుడుఁ గలహభోజనుఁడు సర్వంసహావరున కి ట్లని పల్కె వలనుమీఱ
రాజాధిరాజ! యోరమణీయరతిరాజ! రాజశేఖరపదాంభోజమధుప!

యాచకామరభూజ! హరిదశ్వనిభతేజ! కాంచనాచలధైర్యకలితశౌర్య!
పండితజనగేయ! భల్లాణరాయ! నీసరివారులేరు ముజ్జగములందు

తే. నడుగునయ్యలకెల్ల లేదనక యీయఁ, జాలినా వెద్దిరైన నీచరితమునకు
సంతసం బయ్యె నీపుణ్యమింతయంత, యనుచు వర్ణింపఁ దరమె యయ్యజునకైన.

క. కొట్టితివి రిపులఁ జోరులఁ, బట్టితివి మహేశ్వరాంఘ్రిపంకేరుహముల్
పుట్టితివి వంశమణివై, కట్టితి వర్థులకు నొసఁగుఘనమగు బిరుదున్. 8

క. వచ్చితి నినుఁ గనుఁగొనుటకు, మెచ్చితి నీసుగుణములకు మే ల్భళి! యిటు లీ
విచ్చినయర్చనలకుఁ గడు, హెచ్చుగఁ బరితోష మయ్యె నిచ్చో నుదికిన్. 9

తే. పార్థివోత్తమ! నిశ్చలభక్తితోడ, నిందురేఖావతంసు గిరీశు నీశుఁ
గోరి సతతంబుఁ బూజించుధీరమతుల, కనఁగ నిహపరసౌఖ్యంబు లందఁ గలుగు.

సీ. ఫణిహారునకుఁ బ్రదక్షిణము గావించుట దేవాదిదేవునిఁ దెలిసికొనుట
చంద్రశేఖరుపదాబ్జంబు లర్చించుట తవిలి శంభునిచరిత్రములు వినుట
పురదైత్యహరుని నేర్పునఁ బ్రస్తుతించుట భర్గునిదివ్యరూపంబుఁ గనుట
ధరఁ జాగి పార్వతీధవునకు మ్రొక్కుట నెఱి నీశుఁ దనయందు నిల్పికొనుట

గీ. వలయుఁజువ్వె నృపాల! పావనతమిాఱ, నిరవుగా నీశ్వరుని నాశ్రయించువారి
కంఘ్రిధీహస్తకర్ణజిహ్వాగ్రనేత్ర, శీర్షహృదయంబు లలరు విశేషముగను. 11

సీ వినవయ్య! శితికంఠుఁ డనెడునిక్షేపంబు గురుకృపాంజనముచేఁ గోరి కాంచి
హృదయపీఠికయందుఁ బదిలంబుఁ గావించి యదె జగత్కారణం బని తలంచి
గరిమమిాఱఁగఁ దదేకధ్యానమున నుండి కడఁగి షడ్వర్గతస్కరులఁ దఱిమి
చారుశంభుకథాసుధారసం బానుచు నవిరళభక్తివైభవముఁ జెంది

తే. వామదేవార్చనంబె జీవనము గాఁగ, నొనర ముక్తిపథాటికి నుంకు వొసఁగి
యలర నిహపరసౌఖ్యంబు లందవలయు, మహితసుజ్ఞానమతి యైనమానవుండు. 12

మ. పురవిధ్వంసిపదారవిందయుగళీపూజావిధానోల్లస
ద్వరమార్తాండమహోగ్రచారుకిరణవ్రాతంబుచేఁ గాక యో
నరనాథోత్తమ! యెంచిచూడ భువి నన్యాయక్రియాయుక్తి దు
స్తరవిస్తారనితాంతఘోరకలుషధ్వాంతౌఘము ల్వాయునే. 13

తే. విను మిలాధీశ! కడు నవివేకులయిన, నరు లెఱుంగరుగాక శంకరునివంటి
భక్తలోకాభిరక్షణప్రాఢి నలరు, దైవ మెందైనఁ గలఁడె చిత్తమున నరయ. 14

క. చదువులు పెక్కులు నేర్చియు, మది దుర్జనుఁ డెట్టు లభవుమహిమ యెఱుంగున్
వదలక విద్యలు నేర్చియుఁ, బదపడి కాసరము ముక్తిపద్ధతిఁ గనునే? 15

మ. బలభిన్మౌళిమణిప్రభావిసరశుంభద్దివ్యపాదద్వయున్
బలవద్వైరినిశాచరాంబుదజగత్ప్రాణున్ ఫణీంద్రాంగదున్
నళినాప్తేందుకృశానులోచను సువర్ణగ్రావకోదండునిం
గలుషారిన్ ఘనునిం గడుం దెలియ శక్యం బౌనె యెవ్వారికిన్? 16

మ. సురదైతేయులు వారిధిం దరచువోఁ జోద్యంబుగా నయ్యెడం
గరళం బుద్భవమై జగంబుల నడిం గాల్పంగఁ దా నవ్విషం
బరయం గుత్తుకయందుఁ బూని దయతో నంతర్బహిర్లోకముల్
పరిరక్షించినయట్టిశంభునిప్రతాపం బెన్న సామాన్యమే? 17

క. నెఱి ద్వాదశవర్షాయుః, పరిమాణు మృకండుతనయు బ్రతికించి యమున్
గరువం బణఁచినశంభుని, చరితం బహివరున కైనఁ జనునే పొగడన్? 18

క. సర్వేశుఁడు దా నని కడు, గర్వంబునఁ బలుకుచున్న కమలజుశిరముం
గీర్వాణు లెన్నఁ ద్రుంచిన, శర్వునివిక్రమ మెఱుంగ శక్యమె చెపుమా? 19

మ. హరిజంభారివిరించిముఖ్యు లగుదేవానీకముం గూర్చి శం
కరునిం బిల్వక దక్షుఁ డధ్వరముఁ దాఁ గావించుచున్నంత న
గ్గరళగ్రీవుఁడు వానిఁ బట్టి శిరమున్ ఖండించి గీర్వాణు లం
దఱినిం గొట్టినయట్టితద్విజయ మేతన్మాత్రమే భూవరా! 20

తరళ. సురల కేరికిఁ గెల్వరాకతిచోద్యలీలఁ జెలంగు న
ప్పురము లొక్కట శరముఖంబునఁ బూని యేసి జగంబు లా
దరము మీఱఁగఁ బ్రోచినట్టిసుధామయూఖకిరీటునిం
దరమె సన్నుతిసేయ నింతయు ధాతకైన నరేశ్వరా! 21

సీ. మహిమ మీఱఁగ సర్వమంత్రరాట్టనఁ బొల్చుగాయత్రి కెవ్వాఁడు నాయకుండు
కనుఁదమ్మిఁ బూజింపఁ గైటభారాతికిఁ దిరముగాఁ జక్ర మేదేవుఁ డిచ్చె
బ్రహ్మాద్యఖిలజంతుపరిపాలుఁ డౌటచేఁ బశుపతినామ మేప్రభున కలరు
శ్రుతి 'యేక ఏవ రుద్రో న ద్వితీయ' యం చనిశంబు నేవాని నభినుతించు

తే. నట్టిగిరిజేశుఁ డఖిలేశుఁ డఘవినాశుఁ, డార్తరక్షాధురీణుఁ డగాధమూర్తి
గరళగళుఁ డొక్కఁడే కాక కల్గఁడె మఱియు, దైవ మెందైనఁ బరికింపఁ ధరణినాథ!

ఉ. చీమ మహీరుహాగ్రములఁ జేరి ఫలంబులసార మెంతయుం
బ్రేమ భుజించురీతిఁ గడుఁబెద్దయొడల్ గలయుష్ట్రి మేక్రియం
దా మెసఁగంగ నేర్చు? విదితంబుగ నిశ్చలుఁ డైనభక్తున
ట్లామినువాఁక తాల్పువిధ మబ్జభవుండు నెఱుంగ నేర్చునే? 23

ఉ. తొల్లి గుణాఢ్యుఁ డైనచిరితొండఁడు వేడ్కను శైలరాట్సుతా
వల్లభుఁ గొల్చి యాత్మజుని వంచనలేక వధించి భక్తిరం
జిల్లఁగఁ బాక మర్పణముచేసి నిరంతరకీర్తిమంతుఁ డై
యెల్లజగజ్జనం బెఱుఁగ నీశ్వరసత్కృపఁ జెందఁడే తగన్? 24

క. కావున నీ వత్తెఱఁగున, భావజమదహరునిచరణపద్మంబులు స
ద్భావమునఁ గొల్వు మిఁక నా, దేవుఁడు గరుణించి యొసఁగు దివ్యపదంబున్.

వ. అనుటయు మునీంద్రునకు నరేంద్రుం డిట్లనియె. 26

సీ. తాపసోత్తమ! ధరాధరకన్యకాధీశుఁ డనిశంబు చాంచలికునివిధమున
జగదుద్భవస్థితిసంహారకరుఁడును సకలభూతాంతరస్థాయి యగుచుఁ
గర్తయు భోక్తయు గణుతింపఁ దానయై వర్తించుఁగా కెట్లు నేర్తు రొరులు?
కావున నద్దేవుకరుణాకటాక్షవీక్షణముచే వ్రత మెట్లు జరుగఁగదా?
తే. కాక మముబోంట్ల కిది పూనఁ గాఁదరంబె?, యనుచువినయంబుమీఱమేలైనయట్టి
కట్టము లొసంగుటయు మాని కౌతుకంబు, మదిని దైవార వికసితవదనుఁ డగుచు.

క. వీణె యుసుతిఁ గూర్చి జగ, త్ప్రాణాశనశయనుమహిమఁ బాడఁగ విని భ
ల్లాణుఁడు మదిఁ జొక్కుచు గీ, ర్వాణమునీంద్రుని నుతించె రభసముతోడన్.

వ. ఇవ్విధంబున నారదుం డవ్వసుంధరావల్లభుం డొసంగుపూజలఁ గైకొని యనేకా
శీర్వచనంబు లొసంగి యతనిచేత నాజ్ఞ వడసి తద్వృత్తాంతం బీశ్వరుని కెఱింగిం
చువాఁ డైచనుచుఁ దనమనంబున. 29

సీ. చిలువలదొర మంచివిలువమించినసొమ్ము సొగసైనసిగపువ్వు తొగలఱేఁడు
పొలుపుగుల్కెడునయాలఁబోతు చొక్కపుజక్కి పరఁగునేనిగతోలుపట్టుశాలు
తెలిపక్కెబలు రౌతుతలపునక్కపళ్ళెంబు బాగైనయవ్విసం బోగిరంబు
పణఁకుగుబ్బలిపట్టి వలపులయిల్లాలు మొగములాఱిటిమేటి ముద్దుకొడుకు
తే. సరవిఁ జుక్కలరెకిమీఁదు సంగడీఁడు, పసిఁడిమల విల్లు వెన్నుండు పొసఁగునమ్ము
కదలిదొనపాము నారి భూఁబుడమి తేరు, గాఁగఁ జెలువొందుముక్కంటిఁ గాంతుమదిని.

వ. అని మహేశ్వరధ్యానంబు సేయుచు. 31

చ. చని కనియె న్నిలింపమునిసంతతభవ్యయశోవిశాలమున్
సనకసనందనప్రముఖసాధుగణస్తుతిమూలము న్సుపా
వనతరసాను దేశపరివర్తితకిన్నరకంబుకంధరీ
జనమృదుగానమోదితభుజంగమజాలము శ్వేతశైలమున్. 32

సీ. ప్రకటితసహకారపల్లవోద్యత్ఖాదనామోదపరభృతోద్దామరవము
ఘననితంబస్థలోద్గాఢలీలాలోలగీర్వాణకామినీగీతరవము
చారుమారుతపూరితోరుతరాశేషకీచకానీకప్రకీర్ణరవము
సదమలవరఝరీసందోహసంరుద్ధమానితఘూర్ణాయమానరవము

తే. సతతగంగాతరంగసంగతబలాక, చక్రసారసహంసాదిశకునిరవము
నొక్కటం జెలంగు మిగులం గర్ణోత్సవముగ, సురుచిరం బైనయమ్మహీధరమునందు.

చ. గుఱుతుగ పద్మరాగమయకూటతటంబులం గ్రీడసేయుస
త్కిన్నరనికరంబు లాప్రకటకాంతులం జెంది వసింపం దుమ్మెద
ల్వరగున వానినూత్నమదసౌరభలీలలం జేరి నిర్ణయం
బెఱుంగకయుండుం ద్రిమ్మరుచు నెంతయు నబ్బురపాటుతోడుతన్. 34

ఉ. చందురుకాంతచప్పరపుంజాయలం గిన్నరదంపతు లొప్పుదుం
బొందుగ నాశ్రమంబులను బుష్పశిలీముఖకేళిం దేలి తా
రుందురు రేలునుం బవలు నుత్తతురంగశిరస్సుధాంశురు
గ్బృందముల న్మణు ల్గఱంగి పెంపలరం బయిం జిల్కు నగ్గిరిన్. 35

సీ. కొదమసింగములతోం గదిసి మేలములాడుం గేరుచు నున్మత్తవారణములు
వాడిమెకంబులం గూడి వేడుకతోడం గ్రీడించుం బ్రోడలై లేడిగములు
పేర్మితో బావురుబిల్లుల మెల్లన సయ్యాట లాడు మూషకచయంబు
గారవం బలరారం గాఱెనుబోతులం జేరి లీలల నుండు వారువములు

తే. చిలువలునుముంగిసలుచాలంజెలిమిసేయుం, దగరులెప్పుడుతోడేళ్ళందగిలియుండుం
బగ లొకింతయు నెఱుంగ కప్పర్వతమునం, దుహినకరశేఖరునిమహామహిమం జేసి.

మ. కమనీయామలతోయసంయుతములౌ కాసారరాజంబు లం
దము మీఱ న్విలసిల్లుచుండుం బొగడొందం దత్ప్రదేశంబులం
గుముదేందీవరపద్మహల్లకలసత్కూర్మాండజగ్రాహన
క్రమహావ్యాళకుళీరహంసబకకోకస్తోమధామంబులై. 37

చ. ఘన మగుపోఁకమ్రాఁకులును గాంతినిఁ జెన్నగుపొన్నగున్నలుం
బనసలు నారికేళములు పాటలము ల్వకుళామ్రసాలచం
దనములు పారిజాతములు దాడిమము ల్సురపొన్నలాదిగాఁ
దనరు ననేకభూజములు తచ్ఛిఖరీశసమీపభూములన్. 38

వ. మఱియును. 39

చ. సకలితపత్త్రము ల్ప్రకటజాలకచంచువులు న్వసింప నిం
చుకశుకనామ మబ్బుటనె సొంపున మాకు సమంబె? తాళకిం
శుకము లటంచు నెంతయును జూడఁగ నోర్వక తమ్ముఁ బల్కు లన్
శుకములు పల్కనం దతులశోభలఁ గేరుపలాశజాలముల్. 40

చ. సకలసుమంబులం దుఱుముశంభున కెగ్గొనరించి వానిపూ
జను వెలి యైనగేదఁగిని సమ్మతి నుండు నటంచు ఫుల్లచం
పకములు ఫూన్కితోడ మధుపమ్ములఁ బాఱగఁ దోలఁ జేరనీ
యక యటుగానిచో మధుకరావళి సేసిన దేమి వానికిన్? 41

తే. మిండకొని గండుతుమ్మెదపిండు నిండి, యుండ గన్నులపండువై బొండుమల్లె
పొదలలరు నందు హరిరత్నములు ఘటించి, నెఱినిడినమత్రియంపుఁబందిరులనంగ.

చ. సురుచిరపల్లవప్రకటచూతలతాస్థితకోకిలావళు
ల్వరుసఁ జెలంగు మాధవుఁడు వావిరి నవ్వనలక్ష్మి కెంతయున్
గుఱుతుగఁ బ్రేమతోడుతను గూర్చి యొసంగినశోణనీరజ
స్ఫురదసితోత్పలౌఘములఁ బొల్పగుమాలికలో యనం గడున్. 43

రగడ. మఱియుఁ జివురించు నెలమావు లను రావులను, బొరిపొరినివిలసిల్లుపూవులను దావులను
సొలయుచును జారుతరసూనముల లీనములఁ, దలరునిందిందిరవితానముల గానముల
నారూఢఫలరసాహారముల బీరములఁ, గేరి పొలుపారుమదకీరముల వారములఁ
బగలు రేయిలతాగ్రభాగముల భోగములఁ, బొగరెక్కి కూయుపికపూగముల రాగముల
మాటికిని బొదరిండ్లమాటులనునీటులను, గూటములఁ బెనఁగుసుకకోటులనుబోటులను
దానకము లైవమంచారముల తీరముల, మానైనపుష్పాడిదుమారముల పూరముల
మరిగి విద్యాధరకుమారికల చేరికల, సరసగతి నలరారుశారికల కోరికల
విరివిమీఱఁగ నెపుడు వేదములనాదముల, మొరయును నిజనులసమ్మోదములవాదముల
నయ మొప్పసంతతానందముల జెందములఁ, బ్రియలీలఁ దగుపధూబృందముల చందముల

బలమైనపూఁదేనెవానలను గోనలను, జెలఁగి తడియునిలింపసేనలను జానలను
దలుచైనఘనసారతరువులను బోరువులను, దిరమైనఏలచదురుతెరువులను విరువులను
నెఱిఁబూచుసంపెంగనీడలను వాడలను, సరవిఁ దిరిగెడు చెలువజాడలను గ్రీడలను
తొలఁగ కతిమంద వాతూలములలోలములు, నలరియాడెడుమహావ్యాళములజాలములఁ
దొడరి మార్గము లెల్లఁ దుండములఁ గాండములఁ, దడిపి విలసిల్లు వేదండములతండముల
బరఁగుగిరిచెంగటను బాత్రమున గోత్రమున, మరలకవసంతపతిమాత్రమున సూత్రమున.

క. వెండియుఁ బ్రచండమండల, మండితమార్తాండకరసమంచితమై యు
ద్దండజగదండభయదా, ఖండగతి గ్రీష్మఋతువు కడు నొప్పారెన్. 45

వ. మఱియు మింటనంటిన యుష్ణమహీధరంబు జంటన శక్రచాపంబులం బన్ని చెన్నుగఁ గారుగ్రమ్ముచున్న పెనుమబ్బులును, మబ్బుల నిబ్బరంబుగాక యుబ్బరంబుగా నొబ్బన మెఱసి మరలి చనుక్రొక్కారుమెఱుంగులును, మెఱుంగులరంగు గుబ్బునం గనుంగొని యంతరంగంబునఁ బ్రియాంగనల మేనుల మెఱుంగులఁ దలంచి యల్లన నుల్లంబులు ఝల్లన నొల్లంబోయి మల్లడిగొని తల్లడిల్లెడు పాంథవ్యూహంబుల గేహినులకు మోహం బలరఁ బ్రియులరాక యెఱింగించుతెఱంగున ఘోషించు ఘనతరస్తనితంబులును, స్తనితశ్రుతిజనిత కుతూహలావహంబు లగు బర్హంబులు విప్పి తప్పక నర్తనంబులు సేయునీలకంఠంబులును, నీలకంఠధ్వానంబులు హీనంబులుగాక సోఁకిన లీనంబులై యుండు భీకరదర్వీకరానీకంబులును, దర్వీకరానీకంబుల నొక్కొక్కతఱి నాలోకించి మూఁకలై పాఱుభేకంబులును, భేకంబులశోకంబులఁ బాపి లోకంబు లేకంబు సేయుకరణి నదీహ్రదంబులు నిండి యఖండంబులై పాఱునట్లుగాఁ గురియునవారితవారిధారాపరంపరలును, వారిధారాపరంపరలవలన నుండి మెండుగఁ దండంబులై పుడమిముద్దియకు సమయనాయకుం డొసంగిన నూత్నహారరత్నంబు లనంబడు కరకలును, కరకలసరసుగొనక యుఱికి జలబిందుప్రలంబంబుగాఁ గ్రోలి సోలినచాతకవ్రాతంబులును, చాతకవ్రాతంబులకాతుకం బలరెనని దిశల నెఱింగించువిధంబునం బఱచు కేతకీగంధబంధురగంధవాహంబులును, గంధవాహంబులకుఁ జలింపక పెంపున గుంపులై మృగయావిహారలంపటంబునఁ గ్రుమ్మరు కిరాతులును, కిరాతయువతీచరణపంకజసంకలితకుంకుమాంకితపంకంబు లగుతెరువులును, తెరువులం బరువులై విరువులుగఁ బూచి మురువు లలరు కదంబతరువులును, తరువుల నిరవులు చేసి మొల్లంబుగఁ బిల్లల నిడి యుల్లసిల్లు ఖగంబులును, ఖగపోతంబులకు మేఁత లిడుదాత లనం దగి నానాకీటకకోటులం బాటిల్ల

పచ్చికపట్టులును, పచ్చికపట్టుల దట్టంబు లై మరకతప్రదేశంబుల భాసిల్లు పద్మ
రాగంబుల చెలువున నలరు నింద్రగోపంబులును గలిగి వితరణహస్తంబునుం బో
లె నిరంతరవారిధారాకరంబై, మహాశైలగేహంబునుం బోలె సముంచితనీలకంఠశ
బ్దంబై, దివ్యజ్ఞానమూర్తియుం బోలె వికసితసుమనోయుక్తం బై, యుత్కర్షం
బునఁ గర్షకహర్షదం బగువర్షాగమంబు నొప్పు నొక్కభాగంబున. 46

చ. కొలఁకులఁ బద్మముల్ తొలఁగ కోమలకాంతిఁ జెలంగ సస్యము
ల్ఫలపతితంబు లై పొదల భవ్యవిపాండురలీలమీఱు చు
క్కలదొర తేలు వెన్నెలలు గాయఁగ వేల్పులత్రోవ చాల ని
ర్మలత వహింప నందుల శరత్సమయం బలరారు నొక్కెడన్. 47

సీ. ఉత్తరానిలముల మొత్తంబు లలరారె సాంద్రతుషారవర్షంబు గురియ
లీల మీఱ రసాలసాలము ల్గనలెత్తె నదులెల్ల నింకి కాల్వలు గాఁగఁ
జలికి నోడినభంగి శాంతరూపము దాల్చె చండభానుఁడు వేగ జరుగుచుండఁ
గొమ్మలగుబ్బచన్గొండలదండల నెల్లవారును మని యుల్లసిల్లఁ
తే. దెలివిడను నంగజానికేళిఁ దృప్తి యలరఁ, జేయవలె నని తలఁచి నిల్చెడువిధమున
యామినులు దీర్ఘములమీఱ నన్నగమున, నలరు హేమంతఋతువొక్కతలమునందు.

వ. మఱియు నమందసుందరకుందబృందనిష్యందమ్మరందపానానందితహృదయార
విందేందిందిరసందోహం బగుశిశిరసమయంబును నొక్కభాగంబునఁ గలిగి, యి
ట్లు షడృతువులుం దప్పక యెప్పుడును వర్తింప నలవిగాక మనోహరం బై చెలంగు
నమ్మహీధరాగ్రభాగంబున. 49

సీ. మరకతహరినీలమౌక్తికాంబుజరాగవజ్రవైడూర్యప్రవాళపుష్య
రాగగోమేధికరత్నసంస్థాపితమహితకాంచనదివ్యమందిరముల
శక్రాదిదిక్పతు ల్సరవితో సేవింపఁ బ్రమథగణంబులు బలసి కొలువ
వీరభద్ర కుమార విఘ్నరాజ విరించి జలజనేత్రాదులు చనువు సెఱపఁ
తే. గశ్యపాగస్త్యమాండవ్యగౌతమాత్రి, వాఖిల్యభరద్వాజవామదేవ
గాలవవసిష్ఠమైత్రేయకణ్వముఖ్యు, లైనమునిసంఘములు భక్తి నభినుతింప. 50

వ. మఱియును. 51

సీ. గొనికొని 'స శివ ఏకో దేవ' యంచును సరవితోఁ బల్కెడుశారికలును
దత్త్వరీతిని 'శివా త్పరతరం నాస్తి' యం చాడెడుమదమరాళావళియును

'హర వామదేవ మహాదేవ' యని భక్తిఁ గీర్తించుచున రాజకీరములును
'భర్గ శంకర పరబ్రహ్మ త్రినేత్ర' యం చారయఁ గేరుమయూరతతులు

తే. 'నభవభూతేశ హరివిరించ్యర్చితాంఘ్రి, పంకరుహయుగ్మ' యని కేరుపరభృతములు
గలిగి యభినవశృంగారగరిమఁ దనరి, మహితగతి నొప్పుశశిమౌళిమందిరంబు. 52

క. అద్దివ్యధామ మెంతయు, నుద్దామతఁ జొచ్చి యందు నొకచెంగటఁ దా
నుద్దీపితమణిమయ మగు, గద్దియపై సౌఖ్యలీలఁ గదిసినవానిన్. 53

సీ. ఘనతత్సురజితకాంచనభూషణవ్రాత సతతవిశాలయశస్సమేత
నిజభక్తలోకమానితకల్పభూజాత భూరికారుణ్యవిస్ఫురితచరిత
మహిషదానవగర్వమర్దనవిఖ్యాత ముదితాప్సరోజనముదితగీత
కమనీయతరదివ్యకరధృతశుకపోత వితతకటాక్షపోషితవిధాత

తే. బుధజనవ్రాత కేవలభువనమాత, యగుమహాసితనగజాత నమితపూత
నభినవానందబంధురస్వాంతుఁ డగుచుఁ, గనియె సురమౌని కన్నులకలవుదీర. 54

సీ. సర్వగీర్వాణప్రచయసమర్చితదివ్యచరణారవింద యేహరిణనేత్ర
హారహీరపటీరతారకాహిమచారుకీర్తివిస్తార యేకీరవాణి
సతతమానితదాసజనగృహాంగణనవ్యకల్పభూజాత యేకంబుకంఠి
సమరారిసందోహసంహారకరలసద్విక్రమోల్లాస యేవిధునిభాస్య

తే. చిరతరైశ్వర్యయుక్త యేచిగురుఁబోణి, విమలసౌందర్యమూర్తి యేద్విరదయాన
భూరికారుణ్యచిత్త యేపుష్పగంధి, యట్టిశర్వాణి నతిభక్తి నభినుతింతు. 55

మ. సురరాజార్చితపాదపద్మయుగళీ! సూరిస్తవానందినీ!
శరదిందుప్రతిమాననుందరముఖీ! చంచత్కురంగేక్షణీ!
పరదైతేయభయంకరీ! శివకరీ! బ్రహ్మాండభాండోదరీ!
దురితవ్రాతలసన్మతంగజహరీ! దుర్గా! జగత్పావనీ!. 56

తోటకవృత్తము జయ శాంకరి భూరియశస్స్ఫురితా!, జయ సర్వవరప్రదసాధునుతా!
జయ సంతతపావని! శర్వరతా!, జయచంద్రధరప్రియ! శైలసుతా!. 57

చ. అని వినుతించుచున్నఁ గని యంబిక యిట్లను నోమునీంద్ర! నీ
వెనయఁగ నెందు నుండి యిట కిప్పుడు రాక జగంబులందు స
జ్జను లగువారివార్తలు నిజంబుగ వేగ నెఱుంగఁబల్కు వే
యనవుడు నారదుండు వినయంబునఁ జెప్పఁ దొడంగెఁ బొంగుచున్. 58

మ. విను శర్వాణి! యశేషలోకములు నే వీక్షించితింగాని ధా
త్రిని మర్త్యుల్ కడుశంభుభక్తినియతిం దీపించుచు న్నిత్యసం
జనితానందము నొంది రందు నొకయాశ్చర్యంబుఁ గన్గొంటి నో
జననీ! సత్కృపఁ జిత్తగింపు మది విస్పష్టంబుఁగాఁ దెల్పెదన్. 59

సీ. ఘనత మీఱఁగ సింధుకటకం బనఁగ నొప్పు పురవర మొక్కటి ధరణియందు
నప్పట్టణం బేలు నమితకృపాస్వాంతుఁ డక్కవంశజుఁడు భర్మాద్రిధీరుఁ
డనుదినశైవవ్రతాచారశీలుండు భల్లాణుఁ డనురాజు భక్తిమిగుల
నడుగనిజంగాన కలరఁగా నొట్టగు నడిగిన లే దన్న నదియె తనకు
తే. నని దిశలనెల్లఁ జాటించి యద్భుతముగఁ, దనదు మొగసాల నందంబుఁ దనర గంట
వ్రేలఁ గట్టించె నెంతయు వేడ్కతోడ, నెద్దివేఁడిన నర్థుల కిచ్చుచుండు. 60

గీ. మఱువఁ డెప్పుడైన శివనామమంత్రజపము, వెఱవఁ డెందైన నర్థులు వేఁడుటకును
బఱవఁ డరిసంఘములకు సంగరమునందు, గిరిశపదభక్తినిరతుండు నరవరుండు. 61

క. కోప మనికైన లేద, క్ష్మోపమనిరతప్రతాపుఁ డొగి నీతనికిం
గోప మని తలఁచి శాత్రవభూపతు లరుగుదురు తమదుపురవరములకున్. 62

గీ. అద్ధరాధీశునగరిసమృద్ధి యతని, భక్తిమార్గంబు భాసురయుక్తిఁ దెలిసి
మీకు నెఱిఁగింప వచ్చితిఁ బ్రాకటముగ, సమదపికవాణి! శర్వాణి! జలజపాణి!

ఉ. నావుడు శైలపుత్త్రి మునినాథునిపల్కుల కాత్మలోన నెం
తో వెఱఁగంది సంతసముతో నపు డాతని వీడు కొల్పి భ
క్తావళిఁ బ్రోచుతత్పరత నందము మీఱఁ బయోరుహాక్షి యా
భావజగర్వభంజనునిపాలికి శీఘ్రమ యేగి యిట్లనున్. 64

సీ. జయజయ ఫణిహార! సర్వలోకాధార! జయ జయ నగచాప! శశికలాప!
జయ భక్తసురభూజ! సంతతోజ్జ్వలతేజ! జయ మహోన్నతవేష! సాధుపోష!
జయ మానిజనపాల! సామగానవిలోల! జయ చక్రధరబాణ! శరధితూణ!
జయ చారుదరహాస! సామజాజినవాస! జయ విధుస్తుతిపాత్ర! సత్పవిత్ర!
తే. జయ జయ సురపముఖ్యనిర్జరకదంబ, భర్మమకుటాగ్రసుఘటితప్రకటనూత్న
చిత్రరత్నప్రభావిభాసితసుదివ్య, చరణపద్మద్వయోల్లాస! జయ మహేశ! 65

వనమయూరవృత్తము. సామజహరా! హర! తుషారకరభూషా!
కామితఫలప్రద! జగద్విదితవేషా!

తామరససంభవనుతా! గగనకేశా!
నీమహిమ లేఁ బొగడ నేర్తునె గిరీశా! 66

క. జగములు వడిఁ బుట్టింపను, దగ సంరక్షింప నణఁప దైవము వని ని
న్బొగడునుగాదె ముదంబున, నిగమంబులు దేవదేవ! నీలగ్రీవా! 67

క. అరయ నొకవార్త విని మీ, కెఱిఁగింపఁగ వచ్చితి నిపు డెంతయు వేడ్కం
బరిపాటిఁ జిత్తగింపుము, పరమేశా! నగనివేశ! భవ్యవిలాసా! 68

క. హెచ్చుగ గొల్చినవారికి, మెచ్చుగ నర్ధాంగ మయిన మిగులం గృపతో
నిచ్చుఘన మైనదేవుఁడ, వచ్చుగ నినుఁ బొగడఁ దరమె యవ్విధికైనన్. 69

సీ. దంట యై యొకఁడు నేత్రమున నిన్బూజించె వింట నొక్కఁడు గొట్టె వెఱపులేక
యింట గావలియుంచె నిరవుగా నిన్నొక్కఁ డొంటిగా దండెత్తె నొకఁడు గినిసి
కంటకం బలర జోఁకటఁ గ్రుమ్మె నొక్కఁడు కుంటెన నిన్నంపెఁ గోర్కె నొకఁడు
గొంటితనమున జాల్గొని బొప్పె నొకఁడు నిన్నొంటిగ వెలిఁజేసె నొకఁడుపూని
తే. మఱియు నిటమీఁద నద్భుతకరముగాఁగ, నొక్కభక్తుండుధాత్రిపై నిక్కముగను
నిన్నుఁగొల్చుచు నున్నాఁడుచెన్నమీఱ, నతనిమహిమను నెఱిఁగింతునభవ! వినుము.

క. నెఱిసింధుకటక మనియెడు, పురి యేలునృపాలుఁ డమితపుణ్యుఁడు తగ నీ
శ్వరభక్తుఁడు భల్లాణుం, డరయఁగ సతతంబు జంగమార్చనపరుఁడై. 71

చ. అడుగకయున్న జంగమున కారయ నొట్టగుఁ గోర్కె మీఱఁగా
నడిగిన నియ్యకున్నయెడ నట్టె యగుం దన కంచుఁ బల్కె తా
నెడతెగ కెద్దియైన వడి నిచ్చుచు గర్వముతోడ నున్నవాఁ
డుడుపతిసత్కిరీట! కమలోదరపూజిత! భక్తవత్సలా!. 72

గీ. అతనిపట్టణమునకు నీ వరుగుదెంచి, సరవిఁ దద్భక్తిమార్గంబు లరసి చూచి
రమ్ము వేవేగ నని గిరిరాజపుత్రి, పల్కుటయు మోదముననుండె భర్గుఁ డపుడు. 73

క. అద్భుతము నొంద నేటికి, మద్భక్తులజాడ లెఱుఁగ మదవతి! సరసీ
జోద్భవహరిజంభాసుర, జిద్భోగీంద్రులకుఁ దరమె? చిరతరయుక్తిన్. 74

క. నాకన్న నధికు లెన్నగ, లోకానీకంబు లెల్ల లోఁగొనఁగల రో
కోకస్తని! మద్దాసులు, చేకొని యెటులాడుచున్నఁ జెల్లుం జుమ్మీ! 75

ఉ. నిక్కముఁ దెల్పెద న్వినుము నీరజనేత్ర! విధాతకేనియుం
జిక్క నొకింత భక్తునికిఁ జిక్కినపద్ధతి నట్టి లౌటచే

మిక్కిలిభక్తి నన్ గొలిచి మీఱి నరుండు విధూతపాపుఁడై
పెక్కువిధంబుల న్మహినిఁ బేర్మి వహించు నుదగ్రలీలలన్. 76

తే. అశ్వమేధాదియాగంబు లైన ధేను, భూహిరణ్యేభహయతులాపురుషశకట
ముఖ్యదానంబు లైన నోమోహనాంగి!, సరవి మద్భక్తి కింతైన సరియె? చెపుమ!.

క. అలిగినచో విధినైనం, దలఁ ద్రుంతు నిజంబు మీఱ దయచేసినచోఁ
దలఁ దాల్తు నెపుడు వేడుక, లలర గురుద్రోహినైన నంబుజనేత్రా! 78

క. కంటికి ఱెప్పవలె న్నా, గ్గంటిరో! మద్భక్తవరునిఁ గాచుకొనుచు వె
న్వెంటం దిరుగుదు నెప్పుడు, వింటే! చర్చింప నిఁకను వేయేమిటికిన్. 79

ఉ. కావున నీదువాక్యమును గాదన కిప్పుడ యేగుదెంచి త
ద్భావరభక్తి చూచుటకుఁ దోడ్కొని శీఘ్రముగాఁగ వత్తు ని
చ్చో వరవర్ణిను ల్గొలువ శోభనలీల వసింపు మింపుతో
నీ వని పల్కి యద్రిసుత నెమ్మది సమ్మతిచేసి యంతటన్. 80

తే. హరిసురేశాబ్జసంభవాద్యమరవరుల, వేడ్క మీఱంగ నప్పుడే వీడుకొలిపి
కొలువు చాలించి వేవేగ నిలుకు డిగ్గి, తనర భల్లాణువీటికిఁ జనుచునుండె. 81

క. చనిచని కనె శివుఁ డొకచో, ఘనతరకల్లోలమాలికాపరిభాసి
న్వినుతయశోరాశిం బ్రభు, వనదురితవినాశిఁ బృథులవణవారాశిన్. 82

సీ. వేలాతలోదంచదేలాలతాగ్రాతిహేలావిలోలాళిజాలకంబు
శుంభత్క్రియారంభకుంభీనసగ్రాహకుంభీరసంరంభజృంభితంబు
రంగన్మహోత్తుంగభంగావళీతటశృంగారితాంభోమతంగకులము
భూరిప్రకారసంచారధారాధరవారచారుతరప్రతీరభూమి
తే. కలితబలయుతఘనతిమింగిలవిలాస, చలనసతతస్ఫుటీకృతఝుషజటూక
ఝేకకర్కటకమకరకుంభీరశుక్తి, శంఖవరరత్నసంఘ మాసాగరంబు. 83

చ. సకలజగంబుల న్మనుచుసామికి నీవు విసం బొసంగెనే
ప్రకటితలీల నంచు వలపాల్కడలి న్నిరసించి తాఁ బురాం
తకునకుఁ గాన్క లియ్యఁగ ముదంబునఁ బట్టుసుధాసముత్కరం
బొకొ యన నొప్పుఫేనతతి యొప్పఁగ నజ్జలరాశి నెంతయున్. [రుతమ్ముల్

లయగ్రాహి. ఇమ్ము లగుఘూర్ణితరవమ్ములు మృదంగనినదమ్ములుగ నండజచయమ్ముల
ప్రస్తుకొని గీతపురవమ్ములుగ సారెకుఁ బ్లవమ్ములధ్వనుల్ ఘనమనమ్ములుగ మ్రోయన్

నెమ్మి యలరార నటనమ్ము లొనరించు నలకొమ్మలో యనంగఁ జెలువమ్ముగ నకూపా
రమ్మునఁ జెలంగు నిరతమ్మును విలాసగతిఁ ద్రిమ్మరుచు వీచిక లొకమ్మడినిఁ జూడఁగన్.

చ. సలలితనూత్నరత్నమయసైకతము ల్విలసిల్ల నచ్ఛజం
గలితబలాకజాలము లఖండగతి న్వసియింపఁ జాల ని
మ్ముల మణిమేఖలాఘటితముం బరిశుద్ధనవీనచేలముం
గలజలజాక్షి చొక్కపుని గారపుఁగొప్పపిఱుందులో యనన్. 86

ఉ. జాలరుపువ్వుఁబోణులు వెసం దమబిత్తరివాలుఁగన్నులం
బోలిక చేసిరో యనఁగఁ బూనికె పాలికెగండుమీల బ
ల్గాలమునందుఁ గ్రుత్తు రధికం బగుకోరికమీఱఁ బట్టి తా
రేలలు పాడుకొంచు మది కింపుగ నవ్వనరాశిచెంతలన్. 87

శా. ఆరత్నాకరతీరభూములు సముద్యల్లాంగలీతాళజం
బీరామ్రక్రముకప్రవాళకదళీబిల్వామ్లకాకేతకీ
నారంగప్రముఖాఖిలాగమవితానచ్ఛాయలం దెల్లఁ బ
ల్మారుం గోర్కెల విశ్రమించుచును లీలన్ శూలి దానంతటన్. 88

సీ. రమణీయమౌక్తికరచితసౌధంబులు మేలైనహరినీలజాలకములు
విమలచంద్రోపలవేదికాస్థలములు గురుతరాంబుజరాగకుడ్యములును
సురుచిరవైడూర్యసోపానవితతులు పాటింప వజ్రకవాటములును
బటుపుష్యరాగసంఘటితార్గళంబులు భూరిగారుత్మతద్వారములును
తే. శుంభదున్నతవిద్రుమస్తంభములును, గలితసంతతశృంగారగరిమతోడఁ
బొలుపుమీఱెడుభల్లాణపురవరంబుఁ, దగఁ బ్రవేశించె నగ్గజదైత్యహరుఁడు. 89

క. అప్పురవీథిం జనుచోఁ, గప్పురము జవాది యగరు కస్తురియును బెన్
గుప్పలుగ నుంచి యమ్మెడు, గొప్పపసారములు గాంచె గురుఁ డొకచోటన్. 90

చ. నిరుపమరత్నపుంజరమణీయతలేందుశిలావితర్దిపై
నరయ సమస్తవస్తువులు నమ్మెడువైశ్యునిఁ జూచె శూలి తా
సురమణిశృంగసంగరజితోర్విధరాంచితమధ్యసీమయం
దిరవుగ నుండునట్టియలకేశ్వరుఁ బోలినవాని నొక్కెడన్. 91

క హాటకమయచిత్రాంబర, కోటులు మేటులుగ నుంచి గుఱుతుగ నెపుడు
న్నాటించి యమ్ముచుండెడు, చోటులుగనె నొకట నిందుజూటుఁడు వీటన్. 92

క. పొంగారువేడ్కఁ దోడ భు, జంగమరాజాంగదుండు వెసఁ గనుఁగొనియెన్
రంగత్తురంగఘనమా, తంగశతాంగములగములఁ దగ నొకచోటన్. 93

క. గనుఁగొనె నొక్కచోట నవకాంచనరత్నసపుంచదూర్మికా
ఘనతరమేఖలాకటకకంకణకంఠవిభూషణాదిమం
జనవిచయంబు నెంతయు దృఢంబుగ నిల్పి క్రయించువారలం
దునఁ దుదిలేని వేడుకలతో నలకారి పురారి సారెకున్. 94

చ. ఒనరఁగ విప్రకాంతలసమున్నతదేహరుచుల్ తటిద్రుచుల్
ఘనతరవేదనాదములు గర్జితము ల్పటుహోమధూమముల్
తనరఁగ నీలనీరదకదంబము లందు గృహాహిభుక్తతు
ల్పనివడి వే నటింపఁ గనె బ్రాహ్మణవీథిఁ గపర్ది యొక్కెడన్. 95

వ. మఱియును గరితురగరథారోహణాస్త్రశస్త్రవిద్యాభ్యాసపరాయణజనభాసురంబులగు క్షత్త్రియనివాసంబులును, ధనకనకాంబరప్రముఖసమస్తవస్తుసుందరంబులగు వైశ్యమందిరంబులును, గోమహిషోష్ట్రచ్ఛాగాద్యఖిలపశుసమూహంబులగు శూద్రగేహంబులును, గంధపుష్పాక్షతధూపదీపఫలరసాపూపోపహారసమేతంబులగు దేవతానికేతనంబులును, కలితమణిగణకిరణవిస్ఫారంబులగు కాంచనప్రాకారంబులును, ఝషకమకరకర్కటగ్రాహమహోరగభీకరభేకానీకకుముదకహ్లారసారసప్రచయవిశాలంబులగు పరిఖాజాలంబులును, సముంచితనూత్ననవరత్నమాలికలగు కపోతపాలికలును, ముక్తాఫలచూర్ణరంగద్రంగవల్లికాసంగతంబులగు వితర్దికాప్రాంగణంబులును, లీలావిలాససంచారిసుందరీసందోహసౌధశిఖరంబులును, నిరంతరపల్లవితకోరకితపుష్పితఫలితలలితక్రియాప్రమోదితశుకపికమధుకరనికరప్రకటారవభాసమానంబులగు నుద్యానవనంబులును, గ్రమక్రమంబునఁ జూచుచుఁ బ్రచ్ఛన్నవేషంబునం జని మఱియు 96

చ. రతిపతిపువ్వుఁదోఁట యొనరంగ భుజంగుల కొడ్డుమీటు సం
తతమదనజ్వరంబునకు దట్టపుమందులమూట సౌఖ్యసం
హతులకు బల్కరాట మిరవై తగునప్పురినొక్కచోట శో
భితగతిఁ జెంది వేశ్యతతిపేఁట బుధు ల్నుతిసేయు చేటగున్. 97

సీ. చిత్తజాతుఁడు విటశ్రేణి కాసలు గొల్పఁ బూని నిల్పినపైఁడిబొమ్మ లనఁగఁ
జెలువొప్ప రతికాంతచే విలాసప్రౌఢిఁ బరఁగుచేమంతిపూఁబంతు లనఁగఁ

బోలుపుగాఁ బరిపూర్ణపూర్ణిమారాత్రుల వలరాయశీతాంశుకళ లనంగ
జగము లామోదింపఁ జతురాస్యుఁ డొనరింపఁ దనరారుమించుటద్దము లనంగ

తే. బాగుమీఱినపగడంపుఁదీఁగె లనఁగ, నొఱపు గలిగినతొలుకరిమెఱుపు లనఁగ
రూపలావణ్యయౌవనరూఢి నలరి, యందముగ వారభామిను లుందు రందు.

సీ. అళులు తామరలు చెల్వారుమారునివిండ్లు కలువరేకులు మంచిగంధఫలులు
కుందము ల్కెంపునింపొందునద్దంబులు శ్రీలు శిరీషము ల్చిగురుటాకు
లలశంఖములు జక్కవలు నీలసర్పము ల్వీచులు సింగము ల్వాలయుఁగొలఁకు
లిసుకతిన్నెలు బాగెసఁగుదిండె నవిరు ల్కరికరాలు కలమగర్భములును
తే. గచ్ఛపంబులు నొనఁగూర్చి కమలభవుఁడు, మిగుల నేరుపు దనర నిర్మింపఁబోలు
భూరిశృంగారగరిమచేఁ బేరు గలిగి, యలరునమ్మించుఁబోణులయవయవములు. 99

ఆ. అతులగతులఁ బతుల నత్యుపరతులసంగతులచేఁ బ్రమోదయుతులఁ జేసి
నుతులఁ దనరురూపవతు లగునవ్వార, సతులప్రతులు గలరె క్షితులయందు? 100

ఉ. ఆసవపానయోషిదధరామృతపానవనోపగూహనో
ల్లాసముల న్సమంచితవిలాసముల న్మృదుగంధసారపు
న్వాసనల న్బ్రహాసముల వావిరి నగ్గజరాజయానల
న్మానురలీలఁ గూడుకొని పల్లవసంఘము లుందు రందున్. 101

క. ద్యూతంబుల మృదుతరసంగీతంబులచేత మతియుఁ గేరుచు విట సం
ఘాతంబులు వసియింతురు, చేతంబులు లేక జొల్పుచెల్వాన నెపుడున్. 102

చ. మదవకిరాతతీవ్రతరమార్గణపంక్తుల కాత్మ నెంతయుం
గదిసినభీతిఁ బల్లవమృగంబులు వారవధూప్రదేశము
ల్కడురుఁగఁ జేరి గుబ్బచనుఁగొండలచాటున దాఁగ రాఁగఁ ద
త్సదనములందు బెబ్బులులచాడ్పున వేశ్యలతల్లు లుండ్రొగిన్. 103

వ. అని వేశ్యవాటంబు వాటంబుగాఁ బ్రవేశించి శశిజూటుం డందుల బోటులనెల్ల నొ
క్కచోటికి రావించి. 104

సీ. బన్నసరంబులు పచ్చలకడియంబు లాణిముత్తెపుఁబేసు లందియలును
గమ్మలు బవిరెలు గంటలమొలనూళ్ళు రంగైనభుజకీర్తు లుంగరములు
మొగపులతీఁగెలు బొగడలు బావిలీ ల్కలంపుముంగఱు ల్కైవళములు
చెవులపువ్వులు మంచిచేర్చుక్కబొట్టులు సొగసొప్పుబంగారుమొగలిరేకు

తే. లాదిగాఁ గల్గుదివ్యభూషావళియును, వన్నెచీరెలు అవికలు వలసినంత
విత్తమును వేగ నొసఁగె నవ్వేలఁదులకును, గట్టుగమితేని గారాబుపట్టిమగఁడు.

ఉ. అటుల నొసంగి యొక్కకనకాంబుజపత్త్రవిశాలనేత్రకుం
బటుతరకామశాస్త్రచయపారగుఁడై విలసిల్లునట్టి స
ద్విటు నొకనొక్కని న్మిగుల వేడుకతో నొనఁగూర్చె వారిఁ బ్ర
స్ఫుటరతికేళిసౌఖ్యములఁ బూని వసింపఁగఁ జేసె వాసిగన్. 106

తే. కూర్మిఁ బల్లవకోటి నక్కొమ్మలకును, దనర నొనఁగూర్చినట్టిమాధవునిలీలఁ
గూర్మిఁ బల్లవకోటి నక్కొమ్మలకును, దనర నొనఁగూర్చె నయ్యుమాధవుఁడు వెసను.

మత్తకోకిల. మానితంబుగ లోకము ల్నిజమాయచేఁ బలుమాఱును
న్బాని మోహము నొందఁజేసి వినోదవైఖరిఁ గేరు త
ద్భానుకోటిసమానతేజుఁడు బాగుమీఱఁగ నయ్యెడం
దాను న్విటజంగమాకృతిఁ దాల్చె నెంతయు వేడుకన్. 108

చ. నెఱపులతేఁటిగుంపుల గణింపఁగ జాల్కునుసోగవెండ్రుక
ల్మెఱిఁ గొనగోళ్ళ దువ్వికొని నేర్పలర న్సిగవైచి యాపయిం
దఱుచుగ మేల్మిబంగరపుఁదాయెతులు న్విరిదండలుం గరం
బఱుదుగఁ జుట్టి పూనెఁ జెలువార శిరోంశుక మింపుమీఱఁగన్. 109

చ. మనుపగు నిల్వుటద్దముఁ గనుంగొని సన్నపుభూతిరేఖ యొ
య్యన సొగసొప్ప నెన్నుదుటియందునఁ దీరిచి చూచునప్పురీ
జనులకు సొంపుగా బొమలసందున జంత్రపుఁజుక్కబొట్టు నే
ర్పున నిడె నమ్మహేశ్వరుఁడు పొల్పగుమిక్కిలికంటవైఖరిన్. 110

క. గండస్థలదీధితులకు, మెండుగ విందొసఁగుగతి నమితతరశోభా
మండితవరకాంచనమణి, కుండలయుగళంబుఁ దాల్చెఁ గొమరుదలిర్పన్. 111

తే. కనకభూషణహారినీలకాంతితతుల, తోడ జోడుగఁ గూడుక క్రీడసేయు
కరణిఁ దనరెడురుచులఁజొక్కముగ మెఱయ, బవిరిగడ్డంబుసొగసులేర్పడఁగ దువ్వె.

వ. మఱియును. 113

సీ. మణిమయోజ్జ్వలవిభూషణము లొప్పుగఁ దాల్చి కట్టిగాఁ గటి బట్టు దట్టిఁ జుట్టి
జిలుగుబంగరుశాలు వలెవాటుఁగా వించి మేదురంబుగ భూతి మేన నలఁది

సజ్జలింగము సూత్రజన్నిదంబులు బూని రుద్రాక్షమాలిః బ్రౌఢి నించి
గండపెండెరమును గంటలు జంగులు గిలుకుపావలును జెల్వొదవఁ దొడిగి

తే. చెలఁగి నెలవంకకత్తియుఁ జేకటారి, గుఱుతుఁగ నఱుతఁ గడు మొల్లవిరిసరులును
వెలయఁగెం జేతశూలంబు గలిగి గరళ, కంఠుఁ డేరొందె మోహనాకారలీల. 114

తే. తొడల సాదరమొనరించి పిదపఁ దన్నుఁ, దవిలి ప్రార్థింప నయ్యవతారమునను
దాల్చె నలకేతకీగర్భదళములనఁగ, మారవైరికి వాలోరుగోరు లలరె. 115

ఉ. చెక్కులదక్కులన్ మిగులఁ జెల్వగు మోవినిఁ బంటినొక్కులం
జొక్కులచెక్కులం బెళుకుఁజూపులఁ జెన్నగు చిన్నినవ్వులం
జక్కఁగ నిక్కుమక్కువలఁ జక్కెర లొక్కటఁ జిల్కుపల్కులం
గ్రక్కున నెల్లవారలకుఁ గామవికారవిహార మేర్పడెన్. 116

సీ. ఒకభృత్యుఁ డురుయుక్తి జికిలినిద్దపుటద్ద మొగిఁ బూనినీడ బాగొనరఁ జూప
నొకసేవకుఁడు క్రేవ నకలంకమతిఁ జెల్వు మెఱయ నేరుపునఁ జామరము వీవ
నొకదాసుఁ డభిలాష మొదవఁగఁ గపురంపుఁదమలంబు వేమాఱు తవిలి యొసఁగ
నొకకింకరుఁడు పొంక మొప్పఁ జెంతలనుండి భూషణానీకము ల్పొందుపఱుప
తే. మఱియు నొకభక్తుఁ డత్యంతమధురగీత, రవముఁ గావింప నెంతయు రభసమునను
జారుసౌందర్యరేఖాప్రశస్తుఁ డగుచుఁ, దనరి జంగంబు పురవీథిఁ జనుచునుండె.

వ. అట్టియెడ. 118

ఉ. నీరజగంధు లిందుమణినిర్మితనిర్మలభర్మహర్మ్యవి
స్తారతరాగ్రభాగములఁ దా రలరం జరియింపుచుండి సిం
గారము మీఱు నవ్విటశిఖామణిచెల్వముఁ గాంచి యెంతయు
న్మారవికారసంచలితమానస లై తమకించి రందఱున్. 119

క. మఱియును బౌరవధూమణు, లఱుగుగ నమ్మిండజంగమయ్యయొయారం
బిరవుగఁ గనుఁగొనుటకుఁ ద, త్తరమునఁ బఱతెంచి రధికతత్పరమతులై. 120

ఉ. ప్రేమఁ బడంతి యోర్తు సుకరీను సుపత్రము నందమొప్ప ను
ద్దామగతిం గుచాగ్రములఁ దా నిడికొంచు నసించి యవ్విట
గ్రామణిఁ జూడఁ బయ్యెదఁ దిరంబుగఁ జేర్పక వచ్చెఁ గాన్కలా
స్వామికి రత్నకీలితసువర్ణపుబంతులు దెచ్చెనో యనన్. 121

ఉ. ఒల్లెచెఱుంగుపై సడలి యుర్విపయి న్నటియింప లీల ధ
మ్మిల్లము జాతి మల్లికలు మెల్లన నెల్లెడలందు డుల్లఁగాఁ
బల్లవపాణి యోర్తు కచభారచలల్లలితావలగ్నయై
యల్లన నేగుదెంచెఁ గుసుమాయుధసన్నిభుఁ జూడ వేడుకన్. 122

క. నెఱినొడ్డాణము గళమునఁ, దిరముగ ధరియించి మెఱుఁగుఁదీఁగెఁ గడున్ భా
సురగతి నడుమున నిడి యొక, హరిమధ్య మహేశుఁ జూడ నరుదెంచె వడిన్. 123

క. బాలుని బాలకుఁ బిలుచుచు, లీలం గరయుగము సాఁచి లేమ యొకతె య
ట్లాలింగనఁ గన వేగం, బాలింగన మొసఁగ వచ్చు నటు లరుదెంచెన్. 124

సీ. కమనీయసౌవర్ణకర్ణపత్త్రిద్యుతు ల్తళుకులేఁ జెక్కుటద్దములమీఁదఁ
జారుముక్తాహారభూరిశోభావళు ల్ప్రకటవక్షోజకుంభములమీఁదఁ
బటువైనమేఖలాఘటితరత్నప్రభల్ ఘనతరజఘనభాగంబుమీఁద
సురపనీలాభవిస్ఫురితవేణీరుచు ల్సలలితపృథుకటిస్థలముమీఁదఁ
తే. జిలుఁగుఁజెంగావిపావడసిరులు మిగుల, చెల్వుగలచల్వవలువపైఁ బల్విధములఁ
గలిసి వర్తింప నొకశీతకరనిభాస్య, సరవి నరుదెంచె నమ్మహేశ్వరునిఁ జూడ. 125

మ. ప్రమథాధీశునిఁ జూడ నొక్కచెలి శుంభత్ప్రక్రియ న్వచ్చుచో
నమర న్నవ్వుమొగంబుపైఁ గురులు చెల్వారం గడు న్వీడి స
త్క్రమలేందీవరవజ్రపుష్పనవమాఖ్యప్రోల్లసద్రూపికా
సుమమధ్యంబుల సంచరించుమధుపస్తోమంబులో యన్గతిన్. 126

ఉ. గొబ్బున గిబ్బగబ్బిచనుగుబ్బలు జొబ్బిల నబ్బురంబుగా
నిబ్బరమొప్ప చందనము నేర్పునఁ బూసి వెలంది యోర్తు మే
నుబ్బఁగ దివ్యసౌరభము లొక్కట దిక్కులఁ జిక్కి యొల్లెడం
బ్రబ్బ భుజంగజంగముఁ దిరంబుగఁ గన్గొనఁ జేరెఁ గేరుచున్. 127

సీ. ఘనలీలఁ దనరారుననుసోగవెండ్రుక ల్మేలైనసురరాజనీలములుగ
సదమలతరవిరాజన్నఖాంకురములు ప్రకటితమౌక్తికప్రకరములుగ
సతతశోభాసమంచితదంతపంక్తులు వన్నెకెక్కినమంచివజ్రములుగ
భూరిప్రభాపరిస్ఫురదధరోష్ఠంబు రమణీయతరపద్మరాగముగను
తే. రతివధూమణిచే నూత్నరత్నఖచిత, మగుచుఁ జెలువొందుచొక్కపుజిగిపసిండి
బొమ్మ యన నొక్క ముద్దులగుమ్మ వేడ్క, నవ్విరూపాక్షుఁ గన్గొన నరుగుదెంచె.

శా. చంచల్లీల నొకర్తు నీలజలదచ్ఛన్నోడురాడ్బింబమో
యొంచ న్మించినచంచరీకతతిచే నింపొందురాజీవమో
యంచు న్బొల్పఁగఁ జాలి మోముపయి జెల్వౌకుంతలశ్రేణి న
ర్తించ న్నీలగళుం గనుంగొనుట కేతెంచె న్విరుల్మించఁగన్. 129

చ. సకియ యొకర్తు నూపురలసన్మణికంకణకింకిణీధ్వను
ల్వికటగతిం జెలంగఁ బరిభాసితనవ్యసువర్ణభూషణ
ప్రకరము లుల్లసిల్ల నలపల్లవశేఖరుఁ జూడవచ్చె ద
ర్పకకరముక్తమై సరవిఁ బర్వెడుచొక్కపుడేగయో యనన్. 130

సుగంధి. ఈగతి న్ద్విరేఫవేణులెల్ల సంతసంబుతో
వేగ నేగుదెంచి యంత వింతకాంతి నెంతయు
న్బాగుమీఱినట్టినట్టిమేటి పైఁడిగట్టువిల్తునిన్
యోగినాథుఁ జూచి రాగయోగ మొప్ప నొక్కటన్. 131

ఉ. అంగన లెల్ల వేడుక ననంగశతప్రతిమానభంగ ది
వ్యాంగుని నబ్భుజంగునిఁ బ్రియంబున నీక్రియఁ జూచి జాళువా
బంగరుపళ్ళెరంబులను బాగుగ రత్నము లుంచి హారతు
ల్సంగతితో నొసంగి సరసంబుగ నేసలు చల్లి రంతటన్. 132

ఉ. అద్దిర వీనిచెల్వము! జయంత ధనేశకుమార మారుల
న్బద్దయుఁ గెల్వఁజాలు ధరణి న్వెలసిల్లెడు మేనితేజ మా
ప్రొద్దునకు న్సమం బనఁగఁబోలు నయారె విలాసలీల నో
ముద్దియలార రండు కడుముద్దులు గుల్కెడునమ్మ! సారెకున్. 133

సీ. పొడలేదు కొదపుతుమ్మెదగుంపు నదలించుఁ బరికింప వీనిపెన్నెరులకాంతి
తొగలరాయునితోడఁ దుల యౌ ననఁగవచ్చు మొనసి వెక్కసు వీనిముద్దుమోము
వెలిదమ్మిఱేకులఁ బలుమాఱు నిరసించు రమణిరో! వీనినేత్రములచెల్వు
తళతళ మెఱయునిద్దపుటద్దముల నేలు లీలతో వీనికపోలయుగము
తే. వెలయుతిలపుష్పమును గేరు వీనినాస, వింత యగుసింగిణీవిండ్లు వీనిబొమలు
కొల్లలుగ మొల్లమొగ్గలఁ గోడిగించు, నెంతయును బంతమున వీనిదంతపంక్తి.

క. నెలఁతా! పున్నమఱేఁడె, న్నెల తా సరియగునె పోల్ప నెఱి నీతనిచె
ల్వాలరెడునగపునకు న్మను, బలుకులకు న్సరియె చిలుకపలుకులు ధాత్రిన్? 135

గీ. కంబుసన్నిభ మైనగళంబువాఁడు, ఇమ్ముమీఱు విశాలవక్షమ్మువాఁడు [డు
రమణఁ బొడవగుబాహు దండములవాఁడు, తొడరిసింగంబుఁ గెల్చు నెన్నడుమువాఁ

ఉ. తమ్ములఁ గేరుపాదలసితమ్ములవాఁడు నవీనబంధుజీ
వమ్ము నదల్చుమోవిచెలువమ్మును గల్గినవాఁడు పేర్మిఁ జో
క్కమ్మునఁ గమ్మవిల్తుతమకమ్ము నణంచెడువాఁడు లీలతో
నమ్మకచెల్ల! వీఁడు మది నమ్మక పోవఁడి దేమిచోద్యమో? 137

సీ. ఎమ్మెమీఱఁగ వీనికెమ్మోవి యానుట భావింప నమృతంబుసేవ గాదె?
పొలుపొంద వీనితోఁ బొందొనర్చుట వేడ్క నలకల్పభూజాశ్రయంబు గాదె?
లీల వీనిని గౌఁగిలించుట నిర్జరగవి యిచ్చునిష్టానుభవము గాదె?
వల నైనచెల్వముఁ బరిపూని కన్గొంటఁ దలఁపఁగ ననిమిషత్వంబు గాదె?
తే. కుసుమశరకేళి వీనితోఁ గూడియుంటఁ, బ్రకటితం బగుసామ్రాజ్యపదవి గాదె?
యిమ్ముగా స్వర్గలోకసౌఖ్యమ్మువేఱె, కోరవలయునె వీఁడు చేకొనియె నేని?. 138

ఉ. కొమ్మరో! మోము ముద్దుగొని కోరికఁ జెక్కులు గోట మీటి చె
ల్వమ్ముగ నెంతయున్ గళరవమ్ములు మీఱఁగఁ బూని తేనియల్
గ్రమ్మెడుమోవి యాని యధికంబుగ వీనియురమ్ము సారెకుం
గ్రుమ్మఁగరాదె గబ్బిచనుగుబ్బల నుబ్బును గొబ్బుగొబ్బునన్? 139

క. కుతుకమునఁ బ్రతిదినము నీ, చతురుని మెయిజంట నుండుసతిభాగ్యము సం
స్తుతి సేయఁదరమె తిరముగఁ, జతురాస్యున కైన వానిచానకునైనన్. 140

ఉ. ఈనెఱజాణఁ డీచెలువుఁ డీదరహాసవిభాసితాననుం
డీనళినీకళత్రనిభుఁ డీప్రభుఁ డీనవయావనాంగుఁ డే
మానిని నైన నెంతయును మన్మథబాణవికంపితాత్మఁ గాఁ
దా నొనరింపకున్నె? వనితామణులార! విలాససంపదన్. 141

శా. వీనిం జూచినపూవుఁబోఁడి మదనావిర్భావలోలాత్మయై
మేనం బుల్కలు గ్రమ్మ మేటిజిగిచన్నెట్టల్ గగుర్పట్టఁగా
నూనాస్త్రాలయమెల్లఁ జెమ్మగిలఁ దాఁ జొక్కంగదే కొమ్మ! యిం
పూనం జంద్రునిఁ గన్నచంద్రశిలయుంబోలెం బ్రమోదంబునన్. 142

ఉ. కంజదళాక్షి! యీననువుకానిఁ గనుంగొనినంతనుండియున్
రంజలి మానసంబు పరిరంభణలాలసమయ్యెఁ జయ్యనన్

మంజులపుష్పబాణములు మన్మథుఁ డేయఁదొణంగెఁ బైపయిం
బింజయుఁ బింజయుం దవులఁ జేర్చి కడున్ దృఢలీల నొక్కటన్. 143

క. అతివా! శతధృతి యీతనిఁ, బతిఁగా నూహింపకున్న పాపమున నె కా
మతిఁ దలకోఁతలఁ బడియెన్, సతతము భువనంబులెల్లఁ జర్చింపంగన్. 144

వ. అని మఱియు నిట్లని వితర్కించిరి. 145

సీ. పణఁతి యీతండు వాక్పతియొ! యిట్లనఁగ నల్మొగములుఁ బుక్కిట ముగ్ధ యేది?
తరుణి యితండు మాధవుఁడో! యిట్లన శంఖచక్రముల్ ఔమ్మునఁ జాన యేది?
ధవళాక్షి యితఁడు వాసవుఁడో! యిట్లన వేయుఁగన్నులుఁ గులిశంబుఁగలుగు టేది?
శుకవాణి యితఁడు దర్పకుఁడో! యిట్లనఁగ గ్రొవ్విరితూపులును దియ్యవిల్లు నేది?
తే. యితఁడు భల్లాణునిజభక్తి మతినిఁ దెలియఁ, జల్లమాంబనిజంబెల్ల సరవి నరయఁ
బూనిచనుచున్న శివుఁడు గాఁబోలు నిదియొ, తథ్యమగు నిందుముఖులార! తలఁచిచూడ.

క. తొలినోములఫల మిప్పుడీ, చెలువునిఁ గనుఁగొంట యిందుచే భాగ్యం బో
చెలులార! కల్గె నిట్టులఁ, దలఁపఁగ నద్భుతము గాదె ధారుణియందున్?. 147

క. అని యివ్విధమునఁ బురసతు, లెనలేనిముదంబుతోడ నీక్షించుచుఁ దన్
గొనియాడ నంత శివుఁడా, జనపతి మొగసాలదరికిఁ జనియెన్ లీలన్. 148

వ. అని సూతుండు డెలింగించిన విని నైమిశారణ్యమహామును లటమీఁదివృత్తాంతం బె
ట్లని యడుగుటయు. 149

శా. గౌరీచారుపయోధరద్వయమిళత్కస్తూరికాకర్దమ
స్ఫారోదగ్రభుజాంతరాళవిధిజంభద్విణ్ముఖామర్త్యకో
టీరస్థాపితసూత్నరత్నరుచిధాటీప్రోల్లసత్పాద! మం
దారక్షీరపటీరహారహిమగుర్వాభమందస్మితా!. 150

క. తరుణారుణాబ్జసుందర, చరణా! దురితాబ్ధితరణ! సంతతకరుణా!
ధరణీధరశరణా! శశి, భరణా! కరిహరణ! నిఖిలభయసంహరణా! 151

తరల. భువనపోషణ! సత్యభాషణ! భోగిరాజవిభూషణా!
దివిజపాలన! ద్విడ్విభాలన! దివ్యతాండవఖేలనా!
పవిధరార్చిత! మానిపూజిత! భానుకోటివిరాజితా!
శివగిరీశ్వర! భూతిదాయక! సింధుజాధిపసాయకా!. 152

మాలిని. మనసిజశతరూపా! మర్దితాశేషపాపా!
దనుజరిపుకలాపా! దర్పితోద్యత్ప్రతాపా!
ధనపతివరమిత్రా! దాససంస్తోత్రపాత్రా!
ఘనతరనిజశౌర్యా! కాంచనాహార్యధైర్యా! 153

గద్య ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వర ప్రసాద లబ్ధ కవితా సామ్రాజ్య ధురంధర ఘన యశోబంధుర కౌండిన్యగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర బుధ జన విధేయ తిమ్మయ నామధేయ ప్రణీతం బైన రాజశేఖర విలాసం బనుకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# రాజశేఖరవిలాసము.

## తృతీయాశ్వాసము.

---



మత్కామితజనసుర
భూమీరుహ! భుజగవరవిభూషణ! సుగుణ
స్తోమ! హిమాచలకన్యా
కోమలముఖపద్మభృంగ! కుక్కుటలింగా. 1

వ. అవధరింపుము నైమిశారణ్యమహర్షులకు నిఖిలపురాణవ్యాఖ్యానవిఖ్యాతుం డగు సూతుం డిట్లనియె నట్లు జగన్మోహనాకారుం డగు నవ్విటజంగమేశ్వరుండు తన మందిరద్వారంబునకు వచ్చు టెఱింగి భల్లాణుండు. 2

చ. ఎదురుగ నేగి యాగురుజనేశ్వరుఁ గాంచి నమస్కరించి స
మ్మదమునఁ దోడితెచ్చి సుషమం బగుపీఠిక నుంచి శోభన
ప్రదముగ నర్ఘ్యపాద్యములు భాసురలీల నొసంగి వేగఁ ద
త్పదసలిలంబు మూర్ధమున భక్తినిఁ జల్లుక నిల్చి యుండినన్. 3

క. నెఱిఁ గక్షపాలయం ద, త్యురుకాంతులఁ దనరుభూతి యొక్కింత కరాం
బురుహమునఁ బట్టి యోగీశ్వరుఁ డానృపునుదుట నిడిన సరవి నతండున్. 4

ఉ. పావనమయ్యె మద్గృహము పక్వము లయ్యెఁ దపోవిశేషము
లావిరి వృద్ధిఁబొందెఁ జెలువం బగుకీర్తి యుఁ బూని యర్థి వై
నీవు మహానుభావుఁడవు నేఁ డరుదెంచుటఁ జేసి వేడ్క నో
భావజరూప! పూర్వకృతభాగ్యవశంబున మాకు నియ్యెడన్. 5

క. గురులింగ మిమ్ముఁ గన్గొని, పరితోషము నొంది మది శుభస్థితిఁ దనరెం
బరమేశ్వరుఁ డిప్పుడు స, త్కరుణం బ్రత్యక్షమైనకైవడిమీఱన్. 6

సీ. ఎందుండి యిచటికి నేగుదెంచితి రిట్లు మునిచంద్ర! సౌందర్యమూర్తి దనర
నీమోవిపలుగంటు లీచెక్కుగవచీరు లీచిన్నివెన్నెల నెన్నునగవు
లీముద్దునునుబల్కు లీబిత్తరపుఁజూపు లీవలిపపుఁజెక్కు లీయొయార
మరయంగ మీకె భాసురలీలఁ దగునయ్య మఱి యెందునైన నీమహిమగలదె?

తే. నాఁగ నాశంభుఁ దప్పు డానంద మొదవఁ, జేతులారఁ జేసి నవ్వియుఁ జెలువు మెఱయ
నట్టివిటచిహ్న లేర్పడ నఖిలజనులు, వినఁగ నెఱజాణ యగుచు నిట్లనియెఁ బ్రీతి.

సీ. జననిగర్భంబున జనియించినట్టితత్ఫలమెల్లఁ దెల్పెద నలర వినుఁడు
జారుఁడై సతతంబు వారకాంతలతోడఁ గామకేళులయందుఁ బ్రేమఁ గూడి
కొమరొప్ప నింతుల గుబ్బచన్నులమీఁద గరిమఁ జేయిడుకొని విరులశయ్యఁ
బవళించి సుఖలీలఁ దవిలి యుండినఁగాక కోరికలెల్లను గుదియఁబట్టి
తే. కలలఁ దరుణులఁ గామించి కలితుఁడగుచుఁ, బెరిగి పంచేంద్రియంబులు బిగ్గఁబట్టి
తియ్యవిల్తానిబారికి నొయ్య నోరిగి, తిరుగుచుండిన ఫలమేమి సిరుల కరయ? 8

క. మానినులఁ దవిలియున్నను, మానుగ నిహపరము లొదవు మనుజులకెల్లన్
గానల భూములఁ దిరుగుచుఁ, దానములు జపంబు లేల తగ నొనరింపన్? 9

సీ. సరవి ముత్త్రోవ ద్రిమ్మరిఁ దలనిడుకొన్న కరిదైత్యమథనుండు కామి గాఁడె?
కొమరొప్ప మోహించి కూఁతు నిల్లాలిఁగఁ గైకొన్న పరమేష్ఠి కామి గాఁడె?
కూర్మిఁ బదాఱ్వేలగొల్లపూఁబోణులఁ గలసినవెన్నుండు కామి గాఁడె?
గౌతమమునిపత్నిఁ గడఁగి వరించిన గట్టులపగవాఁడు కామి గాఁడె?
తే. కోరియాచార్యభామినిఁ గూడినట్టి, కైరవాప్తుండు మిక్కిలి కామి గాఁడె?
కామి గాకున్న యట్టియస్ఖలితుఁ డెవఁడొ, కామి గాఁడేని నిర్వాణకామి యగునె?
గీ. అదియునుంగాక కామశాస్త్రాళియందుఁ, గామి గావచ్చునని పల్కుఁ గతన నిట్లు
తనర విటజంగమాకృతిఁ దాల్చి యేను, నలర వెలయాంద్రభక్తుల నడిగికొనుచు. 11

క. భోగింతు నెల్లవేళల, బాగొప్పెడు కామశాస్త్రపద్ధతి వెలయున్
శ్రీగల్గుట కరయఁగ ఫల, మీగతి సుఖియింపవలదె యింపలరారన్? 12

చ. రమణికుచద్వయం బొగి నురమ్మున నానుక మోము మోముపైఁ
బ్రమదము మీఱఁ జేర్చుకొని పల్మఱుఁ గోర్కులఁ బుష్పశయ్యపై
నమరఁగఁ బవ్వళించి యనయంబును మన్మథసౌఖ్యలీలలన్
గ్రమమున నోలలాడుటయె గాదె సుజన్మఫలంబు ధారుణిన్. 13

క. అని సెలవులఁ బొఱఁగఁ జ, య్యన నవ్వుచుఁ బల్కు జంగమాధిపు నొరయం
జనదనుచు నృపుఁడు లింగా, ర్చన సేయఁగఁ బిలువ నతఁడు క్రమ్మఱఁ బలికెన్.

సీ. జననాథ! మారాకచంద మంతయు నీకు విను మెఱిఁగింతు సవిస్తరముగ
నన్నంబుపై నింపుకైనఁ గోరికలేదు వలనైనవెలఁది గావలయుఁజుమ్ము
వేశ్యలేనిదినాలు వేయైనఁగాని భోజన మొనరింపను సైఁపకుండుఁ
గావున వేవేగఁ గన్నులపండువ యగు దాని నొక్కతెఁ దగినభక్తి

తే. తోడఁ జెప్పింపు వేడుకతోడ నిపుడు, గారవంబుగ నీ విచ్చకట్న మిదియె
యనుడు నృపశేఖరుఁడు నేర్పదనర నతనిఁ, గాంచి యిట్లను సద్వచోగరిమ మీఱ.

చ. విను గురునాథ! నిక్క మగు విన్నప మొక్కటి చిత్తగించి యి
ట్లనుచితము ల్వచింపఁగ మహాత్ములకున్ దగదయ్య మిమ్ము ని
ప్పని విని యెవ్వరైన నగుబాటొనరించెదరయ్య మీ రెఱుం
గని దిపు డెద్ది యిమ్మహినిఁ గార్యము లేదు గదయ్య తెల్పఁగన్. 16

చ. అడుగు మటెద్దియేనియు రయంబ యొసంగెదఁ గాక మీకు ని
ప్పుడు నొకకన్నియం దెలిసి పొందుగఁ బెండ్లియొనర్చి రత్నపుం
దొడవులు జీరలుం బసులతో ధనధాన్యములున్ గృహంబులున్
గడువడి భృత్యవర్గమును గైకొను మిచ్చెదఁ గోర్కె మీఱఁగన్. 17

క. ఊరూరఁ దప్పకుండఁగ, మేరలు సేయింతు నిపుడు మీ శిష్యులకు
వ్వారంబు లొసఁగునట్లను, దారత వర్షాశనములు తగ నొనరింతున్. 18

తే. పెండ్లికట్నంబులును గడుఁ బేర్మితోడ, రాగికప్పెరలును మీకుఁ బ్రాకటముగ
నియ్యఁ జేసెదఁ బ్రజలచే నెల్లతఱిని, నూనశరరూప! యట్లు గాదేని వినుము. 19

శా. గ్రామంబు ల్కరు లందలంబులు శతాంగంబు ల్తురంగంబులు
న్భూమిం బేరగు వస్తుసంఘములు సంపూర్ణంబుగా నిప్పుడే
ప్రేమల్మీఱఁగ నిత్తుఁ జేకొను మిటు ల్పెక్కేల యీరాజ్యమం
దోమార్తాండనిభప్రకాశ! కొను మీ యర్ధార్ధభాగం బొగిన్. 20

క. ఈరీతి సౌఖ్యలీలల, చే రూఢిగ నుండు టొప్పు చిరతరమహిమం
గోరిక మీఱఁగఁ గైకొను, మారాధ్యజనావతంస! యని పల్కుటయున్. 21

క. ఆపలుకులు విని గురుఁ డతి, కోపోద్రేకమున నృపతికుంజరుఁ గని యో
భూపాలక! నీతెగం, బీపట్టునఁ దెలిసెఁ దలుచు లిం కేమిటికిన్. 22

తే. ధరణి భల్లాణుఁ డెంతయు దాత యనుచుఁ, జెప్పఁగా విని యేతెంచునప్పుడొక్క
కాసాసంగిన వెలయాలు గలుగు నిటుల, లోభ మేటికిఁ గుసుమశరాభ! నీకు. 23

సీ. భేకంబుఁ గనిచాల భీతిఁ బర్వెడు బంటు దురమున రిపులఁ బోఁ దఱుమఁగలఁడె?
మడిగట్టు వడి దాఁటఁ దడఁబడు తెట్టువ మించి వారాశి లంఘించఁగలఁడె?
యిసుమంత పసపుకొమ్మొసఁగఁ జాలనివైశ్యుఁ డెనసి యంగడిఁ జూఱలిడఁగఁగలఁడె?
యిలుబాసి వెడలంగ నలయు సోమరి వేగమున వారణాసికిఁ జనఁగఁ గలఁడె?

తే. సరవి మాపంతుఁ డెక్కనఁ దరల లేని, వారణంబు భారంబు మోవంగఁ గలదె?
కావున నొకింత సూత్మమా కామితంబె, యీయఁగా నోపవిఁక నిచ్చు టేది చెపుమ,

గీ. ఎండకన్నును నీడక న్నెఱుఁగకుండి, తనర నఱచేతియర్థంబుఁ గనఁగ లేని
యలఘుతరరాజ్యగర్వాంధు లైనయట్టి, నరవరుల కేల వ్రతములు ధరణియందు. 25

చ. గడియకుఁ బెక్కుమార్గములు కల్లలు పల్కుచు సాధుకోటి త
న్నొడయఁ డటంచు మ్రొక్కునపు డూరక యుండుచు వింతచేష్టలన్
గడువడిఁ దా నొకొక్కయెడఁ గండ్లెఱఁ జేయుచు రాజ్యసౌఖ్యముల్
గడుకొమలాహిరీమసక గ్రమ్మిన మత్తులు గారె భూపతుల్? 26

ఉ. బొంకులకెల్లఁ దానకము పుట్టినయి ల్లగుఁ గల్మషాళికిం
గొంకొక సర్వదుర్గతులకుం దగుమూలము రాజసంబు నీ
వింక నతిప్రయాసమున నిట్లగురాజసవృత్తి నుండియు
న్బింకముతో వ్రతంబున కపేక్ష యొనర్తురె పార్థివోత్తమా? 27

గీ. నీకు నీవేళ నొకకాసు లేకయున్న, నిదిగొ మాచేతికాసైన నిచ్చి వేగ
వెలపొలంతినిఁ దెప్పింపు మఱల నిదియు, వినఁగ గాదేని శపథంబు విడువు మిపుడు. 28

ఉ. వాహనము ల్రథంబులును వారణము ల్మొదవు ల్ధనంబులున్
గేహములు న్బురంబులును గేవలరత్నవిభూషణంబులున్
సాహసవృత్తితో నొసఁగి చాలఁ బ్రియంబునఁ గూర్చి యిప్పుడు
ద్వాహము సేయుకంటె నొకవారవధూటి నొసంగరాదొకో? 29

చ. అనుడు దినేశవంశకలశాంబుధిచంద్రుఁడు యోగిచంద్రునిం
గనుఁగొని యోమహాత్మ! తగుకార్య మెఱింగినరీతి విన్నవిం
చినపని గాని లోభమునఁ జెంది వచించుట గాదు మీర లిం
దున కలుగంగఁ బాడియె? బుధుల్ క్షమసేయరె తప్పు గల్గినన్? 30

క. కావున మీమది కింపుగ, వేవేగ వలంతి యైనవేడుకకత్తెన్
రావించెదఁ గైకొను మో, భావజనిభ! యనిన నతఁడు ప్రమదముతోడన్. 31

క. అటులేని దెలియవిను మొక్కటి భూతలనాథ! వారకాంతవిధము ప్ర
స్ఫుటగతిఁ జెప్పెద జంగమ, విటుఁ డని యెన్నక కడు న్వివేకము మెఱయన్. 32

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రబింబద్యుతిఁ బెద్దయు నిరసించుముద్దుమోము
విరిదమ్మురేకుల నెఱిఁ బరిహాసంబుఁ గావించునిడువాలుఁగన్నుదోయి
బింబికాఫలకాంతిఁ బేర్మి మీఱ జయింపఁ దివిరెడు సొబగైనతియ్యమోవి
మేలిబంగరుబొంగరాలలీలల నేలఁ జాలినకఠినంపుఁజన్నుఁగవయుఁ

తే. గొదమతుమ్మెదకప్పుల గదుముకురులు, కరికరంబుల కెన యనఁ బరఁగుతొడలు
గొప్పపిఱుఁదులు నల్పమై యొప్పుకొను, పృథ్వీనాథ! గభీరనాభియును గల్గి. 33

తరల. మొలకనవ్వులు వాలుఁజూపులు ముద్దుగుల్కెడుపల్కులుం
దళుకుఁజెక్కులు హంసయానము తమ్మితూండ్ల జయింపఁగాఁ
గలభుజంబులు కంబుసన్నిభకంధరంబును గల్గి తా
వలచియున్ వలపింపనేర్చినవామలోచన కావలెన్. 34

క. పురుషుం డలసినమీఁదటఁ, బురుషాయితబంధగతులఁ బొదువుచు వరుసన్
సురతంబు సేయనేర్చిన, గురుకుచ గావలయు నలరఁ గువలయనాథా! 35

క. నఖదంతక్షతచుంబన, ముఖనిఖిలరతిప్రకారములఁ దానె కడున్
సుఖలీలఁ గలయునీరజ, ముఖియే కావలయుఁజుమ్ము భూపతితిలకా! 36

చ. కలకల నవ్వకొంచుఁ దమకంబునఁ గంచెల పిక్కటిల్లఁగాఁ
గులుకుమిటారిగబ్బిచనుగుబ్బలు పైపయి నుబ్బఁ దేనియ
ల్చిలికెడుముద్దుపల్కులను జెన్నుగ మోహముమీఱఁ గేరున
చ్చిలుకలకొల్కి గావలయుఁ జిత్తజకేళికి భూభుజోత్తమా. 37

సీ. నిక్కజక్కవదోయి నెక్కసక్కెములాడు చనుగుబ్బ లురమున నొనర వాని
భుజయుగం బలర మూఁపున లీలఁ గీలించి చెలువొప్పఁ జెక్కునఁ జెక్కఁ జేర్చి
పలుమాఱు గళరవంబులు మీఱి చెలగంగ నిమ్ముగా మరునిల్లు చెమ్మగిలఁగ
కొనగోటిపోటు లొయ్యన మర్మముల్నాట వగలచే బెదరుమై వడఁకు దోఁపఁ
తే. జొక్కి బిగికౌఁగిలింతలఁ బెక్కుక్రియలఁ, బ్రేమ దళుకొత్త బసియించి పిదపనుపరి
సురతమును బ్రౌఢయై సేయుసుందరాంగి, కావలయుఁ జుమ్ము ధారణీకాంత! యిపుడు.

వ. మఱియును. 39

సీ. ధనగర్వమునఁ బల్లవునిఁ దృణీకృతలీల గణనసేయనిపెల్లుకత్తె గాక
కలహించి వేడుకకాని నెంతయు నెగ్గులాడుచు నుండుగయ్యాళి గాక
నెమ్మది యొరునిపై నిలిపి మారునికేళి నలరఁ దేలింపనితులువ గాక
ప్రేమచేఁ బిలిచిన బేలయట్టులఁ బల్కు నొల్లనిమాయలబెల్లి గాక
తే. యొకనిచే విత్తమంది వేఱొకనితోడఁ, గలిసి వర్తించుబల్దొసకారి గాక
పూని యేప్రొద్దునిద్దురపోతు గాక, మదటయును గాక పరికింప మలిన గాక. 40

తే. విటునితోఁ గూడియున్నట్టివెలఁది గాక, జానిసెయు రోగియును గాక పాపి గాక
బేలయును గాక తగ మగనాలు గాక, యున్నవాల్గంటిఁ దెప్పింపు ముర్వీనాథ! 41

క. విను చిత్తిని శంఖిని హ, స్తిని పద్మిని యనెడునాల్గుతెఱఁగులసతులం
దునఁ బేరెన్నికయగుప, ద్మిని గావలెఁ జుమ్ము మాను మిహిరకులేశా! 42

క. శివపాదభక్తి నిరతయు, నవిరళసౌందర్యవతియు నతిపుణ్యగుణ
ప్రవిమలతరహృత్కమలయు, నవనీశ్వర! మాకు నిచ్చునది యిపు డెలమిన్. 43

సీ. ఘనసారమృగమదగంధసారానేకసంతతనవ్యవాసనలచేత
మౌక్తికాంబుజరాగమరకతనీలాదిదివ్యమాణిక్యదీధితులచేతఁ
దరుణేందుబింబసుందరదర్పణావళితరళితఘనధగద్ధగలచేత
సౌవర్ణపర్యంకసంవ్యాప్తమల్లికాద్యతులితకుసుమసంహతులచేత
తే. సరవిఁ దెల్లయిడ్డచందువాసిరులచేతఁ, బ్రకటితము లగుజాలవల్లికలచేత
సొరిదిఁ జేరైననిఖిలవస్తువులచేత, నలరుకేళిగృహంబు గావలయుఁ జుమ్ము. 44

వ. అనిన నృపాలుం డిట్లనియె. 45

తే. అట్లె కానిమ్ము దేవ మీ రానతిచ్చు, క్రమము మీఱంగ నిప్పుడే గడనసతిని
నలరఁ దెప్పింతు ననిపల్కి యాక్షణంబ, కౌతుకంబాత్మ నెంతయుఁ గడలుకొనఁగ.

క. తలవరులఁ బిలిచి ధరణీ, తలవరుఁ డవ్విధముఁ జెప్పి తగినధనంబుల్
వెలనొప్పఁగ నిచ్చి ముదం, బలరఁగ వెలపొలఁతిఁ దెం డటంచుం బలికెన్. 47

వ. అంత. 48

ఉ. పద్మము లెంతయు న్సొబగుఁ బాసి వెస న్ముకుళింప విస్ఫుర
త్సద్మములందు భూసురులు తత్సమయక్రియ లాచరింపఁగా
సద్మము మీఱువార లగుసామజయానలకెల్లఁ జాలహృ
త్పద్మము లుల్లసిల్ల రవి పశ్చిమవారిధిఁ గ్రుంకె నత్తఱిన్. 49

సీ. కరమొప్ప సాంధ్యరాగము మీఱిచెల్వార నంధకారము పర్వె నఖిలదిశలఁ
జుక్క లాకసమునఁ జక్కనొక్కటకుండె ముదముతోఁ దొగలఱేఁ డుదయమయ్యె
జనులకెల్లను బ్రీతి యొనర వెన్నెల యొప్పె లలిఁ జకోరములు కోర్కులఁ జెలంగె
నలిని తాఁ దలవంచె నగియెను గుముదిని కోకంబు లెడబాసి కుందె మదిని
తే. మరుఁడు వెడవింటవిరితూఁపులరయఁ బూని, యేపు దనరారవిరహుల నేయఁ దొడఁగె
సతులకుఁ బురుషులకుఁ బరస్పరవిలాస, రసము చిలికెడుపలుకు లింపెసఁగ నపుడు.

సీ. ముత్యాలతాటంకములు గొమ్ము పూఁబోఁడి! బన్నసరం బిదే సన్నుతాంగి!
భుజకీర్తు లివె చూడు గజరాజగామిని! యొడ్డాణ మిదిగొ మహోత్పలాక్షి!
కరకంకణంబులు గైకొమ్ము హరిమధ్య! చేర్చుక్క బొట్టిదె చిన్నిలాఁడి!
మొగపులతీఁగ చెల్వుగఁ బూను శుకవాణి! సేవిళం బిదె రమ్ము నీలవేణి!
తే. రత్నహారంబు లివె యొడు రాజవదన!, పన్నెచీరలు గొనుము సౌవర్ణవర్ణ!
గంగసారంబుఁ బూయుము మోకంబుకంఠి, యనుచుఁ దుద లేనికోరిక లాత్మ నలర.

ఉ. పల్లవులెల్ల మొల్లముగ బల్లిదులై కడు మంచివస్తువు
లొక్కట్లలుమీఱఁ బట్టుకొని కూరిమితోఁ బఱతెంచి వారసం
ఫుల్లసరోజనేత్రలకుఁ బొందలరాఁగ నొసంగి వేడ్కఁ దం
జిల్లఁగఁ బెక్కుమక్కువలఁ జెంది సుఖింతు రనేకలీలలన్. 52

క. తలవరు లయ్యెడ నర్థము, లలఘుగతిం గొనుచు సరగ నంచితకాంతా
హాలమానసు లగుచు న్వే, శ్యలగృహముల కరిగి విలువసాగిరి వరుసన్. 53

సీ. రమ్ము పద్మావతీ! రావె చింతామణీ! రా జగన్మోహినీ! రాజరేఖ!
రమ్ము చకోరాక్షి! రా పుష్పమంజరీ! రావె లీలావతీ! రత్నపుత్రి!
రా సుందరాకార! రమ్ము కైరవగంధి! రావె బింబాధరి! రమ్యభూష!
రావె కోకిలవాణి! రా సరోరుహపాణి! రా మధువ్రతవేణి! రమ్ము తరుణి!
తే. రావె నారీశిరోమణి! రమ్ము రమణి!, రమ్ము నవచంద్రికాహాస! రాజహంస!
యనుచు వేవేగ నింటింటి కరిగి యిటులఁ, దలవరులు వారకాంతల నలరఁ బిలిచి. 54

క. ధనములు మణిభూషణములు, ఘనతరచిత్రాంబరములు గలపంబులునుం
గొనుఁ డివె విటజంగమునకుఁ, బనిపడి నిద్దురకు నిపుడు ప్రమదముమీఱన్. 55

తే వనజముఖులార! ధారణీవరునియాజ్ఞ, యిట్లు కావున మసలక యీక్షణంబ
వలసినంతధనంబును వరుసఁ గొనుచు, వేగముగ రండు జంగమవిటునికడకు. 56

వ. అని పల్కుటయును. 57

సీ. నెఱజాణఁ డొకఁ డింట నిద్దుర కున్నాఁడు రాఁ గూడ దనె నొక్క రాజవదన
కోడెకాఁ డొకఁడు దాఁ గోరినధన మిచ్చి వదలనీఁ డనె నొక్క వాలుఁగంటి
మిగులఁ గూరిమి చేయువగకాని నెడబాయఁ దగదు రా ననె నొక్క చిగురుఁబోఁడి
పల్లవుఁ డొకఁడు దర్పకకేళి కీవేళఁ గాచినాఁ డనె నొక్క కంబుకంఠి
తే. ననుపుకాఁ డొకఁ డాసించి వినయలీలఁ, దవిలి యున్నాఁడనియె నొక్క ధవళనేత్ర
విటశిరోమణి యొకఁ డిలు వెడలనీక, దంట యై యున్నవాఁ డనె దంట యొకతె.

ఉ. మిండనిఁ బాసి రాఁదగదు మిన్నక పొం డనె నొక్క లేమ చె
ల్వుం డిదె చూడుఁ డట్ల గదిలోనియతం డనె నొక్క రామ భూ
మండలిఁ బేరు గల్గుసుమహుం బగు మేలిపసిండిసొమ్ము లీ
తం డొసఁగన్ గడించి చన ధర్మము గా దనె నొక్క భామయున్. 59

తే. ఇట్లు చెలులెల్లఁ దమవిధం బెఱుఁగఁ జెప్పి,రందుఁ గొందఱు ప్రోడలౌ నిందుముఖులు
మందమధురోక్తు లలరార మానవేశ, కింకరుల కిటు పలికిరి శంక లేక. 60

క. వినుఁ డెఱిఁగించెద నెంతయుఁ, బనివడి గణికాజనంబుపద్ధతులెల్లన్
వినయం బలరారఁగ నో, ఘనులార! సవిస్తరంబుగా నిఁక మీకున్. 61

గీ. విటుఁడు లేనిరేయి వేదనఁ జెందుచు, నిదుర యంటి కెఱుఁగ నేర కుండి
కా సొసంగునట్టికడజాతివాఁడైనఁ, గల్గ గోరు వారకాంత మదిని. 62

సీ. కడుఁ గురూపిని యైనఁ గందర్పనిభుఁ డంచు నభినుతి యొనరింతు రలఘులీల
నంత్యజన్ముని యైన నమలవంశజుఁ డంచుఁ బల్కుదు రెంతయుఁ బ్రౌఢి దనర
నతిమూఢమానసుం డగుమానవుని యైన సరసుఁ డటంచురు సరభసమున
బ్రహ్మహంతకు నైనఁ బరమధార్మికుఁ డంచు గణుతింతు రెపుడును గ్రమముతోడ
తే. నెన్నఁ గల్గిననీతివిహీను నైనఁ, దవిలి సద్వృత్తునిం డంద్రు తమకు నొక్క
వీసమైనను గాసైన వీడె మైనఁ, జేతి కొసఁగినచో నెలచిగురుఁబోండ్లు. 63

ఉ. చిన్నెల వన్నెల న్నగలఁ జిత్రవిధంబుల ముద్దుమాటలన్
వెన్నెల నెన్నునవ్వులను వేమఱు బిత్తరివాలుఁజూపులన్
సన్నల సైగల న్మిగులఁ జాణతనంబున వారకామినుల్
చెన్నుగఁ బల్లవప్రతతిచేత ధనంబులు దోఁతు రెప్పుడున్. 64

సీ. ఒకమాఱు పయ్యెద నోరగాఁ దొలఁగించి సవరించు జిగిగుబ్బచన్నులలర
నొకమాఱు సోగవెండ్రుకల బల్మునుకొప్పు సడల జల్లున విప్పి ముడుచు మఱల
నొకమాఱు మణిమయప్రకటభూషణములు సడలించి తిరుగంగఁ గుదురుపఱుచు
నొకమాఱు నవ్యమౌక్తికమణీహారము ల్లోనగోటఁ జెక్కుల గ్రుచ్చి తివియుఁ
తే. జెలఁగి మఱియును శృంగారచేష్ట లలరఁ, గేరుచుండును బెక్కువిహారములను
సొబగుమీఱుడుపగకాసిఁ జూచినపుడు, మరులు కొల్పును వెలయింతిమహితగతిని.

చ. పొలుపుగ నిన్నుఁ బాసి యొకపూఁట మహాయుగ మంచు నెంచుచో
వలనుగ నీవు నన్నిటుల వంచన సేయఁగఁ బాడియే? యిటుల్
దలఁపఁగ నీతియే? యనుచుఁ దక్కుచుఁ జొక్కుచు నిక్కనంబుగా
వలచినయట్లు మాయలను వారవధూటి భ్రమించుఁ బల్లవున్. 66

చ. ధనము లవేల పో యిపుడు దాసియు నైన గడించు నీక్రియన్
ఘనముగ మాకు నీచెలిమి గల్గుటయే పదివేలటంచుఁ బె
న్వినయపుమాట లాడుచును వేడుక గానిఁ గరంగఁజేసి యొ
య్యన విభవంబుఁ గొంద్రు గణికాంగన లెంతయు నేర్పు మీఱఁగన్. 67

క. వలచినవానికిఁ బడఁతియు, వలచినచందమునఁ దోఁచి వదలదు గా కెం
పుల నైన వెలపొలంతికి, వలపును గనకంబునకును వాసన గలదే? 68

వ. అదియునుం గాక. 69

సీ. పల్లవవ్రాతంబు పాలిబ్రాకాసి ప్రకటితోద్యన్మద్యపాననిరత
గురుతరానేకదుర్గుణగణాలంకార సకలమాయావాదజనసీమ
భూరికోపవికారపూరితనిజచిత్త కఠినవాక్యక్రియాగ్రథితరసన
ధర ననీతులకెల్ల గుఱుతుమీఱినతావు దానధర్మదయావిధానహీన
తే. శాకినీభూతభేతాళసమదదైత్య, భీకరాకార విలయగంభీరనినద
సుమశరారామమార్గభాసురసమగ్ర, లగ్నకంటకయుతవల్లి లంజెతల్లి 70

సీ. కుఱుచలై తఱుచుగా నెఱసీనవెండ్రుక లొప్పు మీఱఁగ దువ్వి కొప్పు ముడిచి
యుఱఁ బ్రాఁతచెప్పుటట్టులఁ బోలి వ్రేలాడు కుచముల ఱవికచేఁ గుదియఁ బట్టి
తొడిగినకుబుసంబువడువున ముడుత లేర్పడియెడునొడలిపైఁ బసపు రాచి
యొలుఁగుతోలును మీఱి యెంతయు మాసిన పెద్దపుట్టము చాలఁ బ్రీతిఁ గట్టి
తే. బొరుసునొసటను జంద్రంపుబొట్టు బెట్టి, యడుసుకన్నులఁ గజ్జలం బడర దిద్ది
బోసినోటను దమలంబు పూని యిటుల, విటులఁ బలుమాఱు నగఁజేయువృద్ధవేశ్య.

తే. పద్మమయినను దగుమహాపద్మమయిన, శంఖమయిన నొసంగినఁ జాలకుండి
ధనదు మెచ్చ దొకింతైనఁ దనకుఁ గల్గు, విత్తమంతయు నీకున్న వేశ్యజనని. 72

క. పసఁ ద్రాగినపులుఁగుక్రియ, న్విసువక తగఁ బ్రేలుకొంచు వేశ్యాంబ కడుం
బిసరేఁగి బూతులాడు, న్బసఁ గల్గనియాగి యడఁగఁ బల్లవతతులన్. 73

ఉ. ఆకులు పోఁకలు న్మణులు హారములు న్బహుగంధసారము
లోక్కకలు రూకలు న్మదిని గోరినయట్టిసమస్తవస్తువు
ల్ప్రాకటమొప్ప మాయ లోగిఁ బన్ని భ్రమించును నేర్పుమీఱఁగాఁ
జేకొనుఁ బో విటావళులచే గణికాంబ విచిత్రవైఖరిన్. 74

గీ. మిండఁ డొకనాఁటిరేయి రాకుండెనేని, గాసుపీసంబు చేతికిఁ గల్గనందు
కించుకేనియు నిదురఁ బోనీదు కూఁతు, గడనపూఁబోఁడి యవ్వ పెన్కంచుమువ్వ.

వ. ఇట్లగుటం జేసి పల్లవవిరహిత యైనవేశ్య మీ రిచ్చుధనంబుఁ గొని జంగమవిటుని
కడకు రాకుండునే యని యథార్థంబుగఁ బల్కిన విని. 76

క. నమ్మక నృపభటు లతిశీ, ఘ్రమ్మునఁ గ్రమ్ముకొని సకలగణికాజనగే
హమ్ములు నిమ్ముగ దూఱి ము, దమ్మునఁ బరికించుకొనుచుఁ దగ నచ్చోట్లన్. 77

క. ద్యూతమధుపానమృదుసం, గీతసుసాహిత్యనృత్యకేళులచేతం
బ్రీతిఁ జెలంగుభుజంగ, వ్రాతంబులఁ గనిరి చిత్రవైఖరిమెఱయన్. 78

ఉ. ఈగతి నుండఁ జూచి ధరణీశ్వరుపాలికిఁ జారు లెంతయు
న్వేగమ చేరి తద్విధము విస్మయలీల నెఱుంగఁ జెప్పిన
న్బోగముచానఁ దేకిటుల బొంకులు బల్కుట మీ కొకింతయు
న్బాగగునే యటంచు నరపాలుఁడు కోపముమీఱఁ జూచుచున్. 79

క. ఉన్నంత పౌరుషల్లెల, కు న్నేగినదూతలెల్ల గొబ్బున నపుడే
ఖిన్నత మీఱఁగ నటువలె, విన్నప మొనరింప ధరణివిభుఁ డవ్వేళన్. 80

ఉ. ఎక్కడఁ జూచినం బురి నొకించుకయు న్నెడ లేక యెప్పుడున్
లెక్కకు నెక్కుడై గడనలేమలు కాచుకయుందు రిప్పుడే
దిక్కున నొక్కవారసుదతీమణి కల్గకయుండు టెంతయున్
మిక్కిలిచోద్య మంచు మది నిల్వక దిగ్గున లేచి యత్తఱిన్. 81

క. నల్లనిశాలు ముసుంగిడి, యెల్లజనంబులను డించి యింపొంద మహీ
వల్లభుఁడు తానె చనియె మ,హోల్లాసపువేశ్యవాటి కున్నతలీలన్. 82

ఉ. ధీరుఁడు భూవరుం డిటులఁ దీవ్రగతిం జని తద్గృహంబులన్
సోరణగండ్లపద్ధతులఁ జూడఁ దొడంగె విచిత్రలీలల
న్గేరుచుఁ గోరికన్ మదనకేళులఁ దేలుచు నుండువారలన్
భూరిసుగంధపుష్పమణిభూషణధారుల నిర్విచారులన్. 83

వ. ఇట్లు చతురశీతిబంధనఖదంతక్షతపరిరంభణాద్యనేక కామశాస్త్రప్రకారంబులం దవి
లి క్రీడించుచున్నం గనుంగొని శివశివేతి మంత్రంబును బఠించుచు విఫలప్రయ
త్నుం డై ధాత్రీవల్లభుండు తనమనంబున వితర్కించె. 84

క. చారులు చెప్పినవిధ మిపు, డారయఁ దథ్యంబ యయ్యె నవ్విటునకు నిం
కేరీతి నొసఁగఁ గల్గుదు, వారవధూమణిని వ్రతము వడి నిల్పుటకున్. 85

క. వెలపొలఁతి గల్గనందున, నిల యేలెడురాజు నంచు నెవ్వతె నైనం
బలిమిం జెప్పించిన నిది, కలుషంబులకెల్ల మొదలు గాదె తలంపన్? 86

చ. కడునడురేయి యయ్యె నని కల్లరిజంగము క్రోధచిత్తుఁ డై
యెడి నదలించి పల్కునొకొ? వంచనమీఱ వ్రతంబు మీఁదట
న్విడువఁగఁ బోలునో? భువిని విశ్రుతమా నపకీర్తి నొందఁగాఁ
బడునొకొ? నీలకంధరునిభాస్వదనుగ్రహ మెట్టు లున్నదో? 87

తే. వేశ్య నొసఁగెద నని మున్ను విశ్వసింపఁ, బలికి యిపు డెట్లుబొంకుదుఁబాడిదప్పి
మహి నసత్యముకన్నఁ గల్మషము కలదె, నేటు సేయంగ మానవకోటులకును?. 88

తే. మును హరిశ్చంద్రముఖ్యు లౌ మనుజపతులు, నిత్యసత్యవ్రతాచారనిపుణు లగుటఁ
గాదె చిరకీర్తి సకలజగంబులందుఁ, జెంది నిర్వాణరాజ్యాభిషిక్తు లైరి. 89

క. కరి హయ భట రథ శిబి కాంబర ధన మణిభూషణాదిబహువస్తువు లి
ద్ధర నెన్నఁగ సతతంబులె, తిరముగ సత్కీర్తిదక్క ధీరాత్ములకున్?. 90

క. మును దీక్షయొసఁగు వేళను, ఘనుఁ డగు గురునాథుఁ డెంత కాదని యనినన్
విన నొల్లక వ్రతభంగం, బొనరింపఁ దలంచు టిప్పు డుచితం బగునే?. 91

క. అదిగావున నవ్విటునకుఁ, గొదుకక పట్టంపుదేవి నొసఁగి ధరిత్రిన్
విదితం బగుశపథము కో,విదు లెన్నఁగ నిల్పికొనుట విహితం బనుచున్. 92

చ. అవనితలేంద్రుఁ డెంతయు రయంబ గృహంబున కేగి సంతత
ప్రవిమలశీలయైన తనభామిని నొయ్యనఁ జేరఁ బిల్చి యో
ధవళసరోజనేత్ర! విను ధర్మయుతం బగునొక్కవాక్యమున్
దవిలినభక్తితోడ విదితంబుగ నీ కెఱుఁగంగఁ జెప్పెదన్. 93

చ. సరసము మీఱ నొక్క విటజంగము ధూర్జటిఁ బోలి నేఁడు దా
నురుతరలీల నెయ్యెడల నుండియొ వేగమె చేరి న న్సభాం
తరమునఁ జూచి యెంతయు ముదంబున దీవెన లిచ్చి కేరుచున్
గుఱుతుగ నొక్కవారసతిఁ గోర్కె నొసంగు మటంచుఁ బల్కెనన్. 94

క. ఇయ్యకొని భటులచేతికి, నెయ్యంబున ఘన మొసంగి నెఱి నొకపడుపుం
దొయ్యలిఁ దెమ్మని పనిచియు, నయ్యెడ వారలను నమ్మ కతిశీఘ్రమునన్. 95

సీ. చని వేశ్యవాటి యెల్లను గ్రమక్రమమున వెదుకంగ నందు నవ్వెలఁదులెల్లఁ
బల్లవసహిత లై పరిపరివిధముల గుఱుతుగా మరుకేళిఁ గూడుచున్న
గనుఁగొని ప్రతిభంగమునను నెమ్మదిఁ జాల వెఱచి యెంతయును వివేకిని యని
నీకు నివ్విధమెల్లఁ బ్రాకటం బలరారఁ దెలుప వచ్చితి నతితీవ్రఫణితి
తే. నిందుముఖి యెన్నఁడు నెఱుంగ నిట్టిచోద్య,మభవుబలుమాయ కాఁబోలు! నైననీదు
బుద్ధితోడుత నూహించి పొసఁగ నొక్క, వాక్య మిట్లని పల్కుమా మనమీఱ.

క. అనుమనుజాధీశ్వరునిం, గని మృదుమధురోక్తు లలరఁ గాంతామణి యి
ట్లను హృదయాధీశ్వర మును, వినవే శితిగళునికథలు విబుధులవలనన్. 97

చ. చిరతరలీల భక్తతతిచిత్తము లారయఁ గోరి యీశ్వరుం
డరుదుగఁ బెక్కురూపుల నహర్నిశముం జరియించుఁ దొల్లియుం
దురితవిదూరుఁ డైనచిరితొండనినిశ్చలభక్తిఁ జూడఁ ద
ద్వరసుతుఁ గూరఁగా నడిగి వానికి నీఁడె మనోరథార్థముల్. 98

తే. అవ్విభుఁడె మున్ను పొదిలె నిమ్మవ్వసుతునిఁ, బూని చంపించుకొఱకునై పోయిదాని
నధికతరహర్ష మొప్పార నన్న మొనర, వేఁడుకొన్నట్టిబల్లాయలాఁడు గాఁడె! 99

క. అట్టిశివదేవునకు నీ, పట్టున నిన్నడుగు టెంతపని సుగుణుఁడవై
యొట్టైన నొసఁగి శపథము, గట్టిగ నిల్పుకొనవలయు ఘనతరలీలన్. 100

మ. నను నెంతేనియుఁ బెద్దఁ జేసి నలినీనాథాన్వయోత్తంస! యి
ట్లనఁగా ధర్మమె? నీవు నాపతివి తథ్యం బేను నీదాసి నిం
దనుమానింపక మీమదిం గలుగున ట్లత్యంతమోదంబుతో
నొనరింపందగుగాక పల్మఱును మీ రూహింప నింకేటికిన్. 101

క. పురుషుఁడు దైవం బతఁడే, కరణి నియోగించు నదియె కావించుట కా
కరయఁగ మతి యొండైనం, దరుణుల కొక్కింతయును స్వతంత్రము గలదే! 102

క. సలలితముగ నిహపరసుఖ, ములు రూఢి నొసంగి సకలపుణ్యఫలంబు
ల్గలిగించువిభునికంటెను, తలిరుంబోఁడులకు వేఱ దైవముగలదే! 103

సీ. కాంతామణులకుఁ జొక్కఁపుఁబెన్నిధానంబు ప్రాకటం బలరారఁ బ్రాణవిభుఁడు
కుసుమగంధులకును గొంగుబంగారంబు ప్రాకటం బలరారఁ బ్రాణవిభుఁడు
కమలాక్షులకు నభీష్టము లిచ్చుదైవంబు ప్రాకటం బలరారఁ బ్రాణవిభుఁడు
చిగురుబోఁడులకుఁ జెల్వగుకల్పభూజంబు ప్రాకటం బలరారఁ బ్రాణవిభుఁడు
తే. చంద్రముఖులకు బహుజన్మజనితదురిత, పటలతిమిరార్కబింబంబు ప్రాణవిభుఁడు
పొలఁతులకుఁ జాల వెల లేనిభూషణంబు, రాజశేఖర! పరికింపఁ బ్రాణవిభుఁడు.

క. వ్రతములును దానధర్మము, లతులితగురుదేవతార్చనాదులు విను మో
క్షితినాథ! యించుకేనియుఁ, బతిభక్తికి సాటియగునె భామామణికిన్. 105

ఉ. కావున నెల్లరీతులను గర్తవు నీ వెటులానతిచ్చినం
బావనలీలఁ జేకొనక పల్కుట యెట్లది కాదటంచు ధా
త్రీవరముఖ్య! నిక్కముగఁ దెల్పుము చింతిల నేటి కీక్రియన్
భావభవారి భక్తతతిపాలిట నెప్పుడుఁ గల్గి యుండఁగన్. 106

క. అని విని జననాథుఁడు వే,దన నొందుచు నవ్విశాలధవళేక్షణ న
క్కనఁ జేర్చి యెదలి క్రమ్మఱ, ననియె న్మది తొట్రుపడఁగ నభినవలీలన్. 107

ఉ. ఓసరసీరుహాక్షి! విను మోకులపావని! యోవధూమణీ!
నీసరి యేరి మానినులు నేటొనరింపఁగ ముజ్జగంబుల
న్వాసిగ నేఁడు నాపలుకువాక్యము మీఱఁగ వేశ్యకాంతవై
భాసిలి జంగమేశ్వరునిభావజకేళిఁ గఱంగఁజేయుమా. 108

ఉ. వారక యీపురి న్నెచట వారవధూమణి గల్గ నందునన్
వారిజనేత్ర! నిన్నిటుల వంచనసేయక వేడ్కకత్తెగాఁ
గోరినవారజంగమునకుం దగ నీవలసెంగదా మదిన్
నేరము లెన్న కియ్యెడల నిల్పుము మద్వచనప్రకారముల్. 109

ఉ. నీవు పతివ్రతామణివి నీవలనం దగ మెచ్చి మేచక
గ్రీవుఁ డభీప్సితార్థములు ప్రేమ నొసంగెడు సంశయం బికన్
భావమునందు నిల్పక కృపామతిఁ జూడుము నన్ను నియ్యెడన్
నావుడుఁ బువ్వుఁబోఁడి తననాథున కిమ్ముగ మ్రొక్కి యిట్లనున్. 110

క. వలనొప్ప నింతపనికై, పలుమఱుఁ బ్రార్థింప నేల పావనమతితో
కలబోఁడుఁగు జంగమునకుం, జెలువుగ నన్నొసఁగవలయు శీఘ్రమున నృపా! 111

క. పరయిల్లు గుత్తఁగొని యొక,దరి నిందుకతాన దీనత న్వేడు క్రియన్
బరికింపఁగ నిటుల హృదీ,శ్వర! కొంచెపుఁబల్కు పల్కవచ్చునె నీకున్. 112

ఉ. భూనుతలీల మున్ వ్రతముఁ బూనితి రెడ్డియు నిత్తుమంచు జం
గానకు వారకాంత నిడఁగా నొనగూడని యంతమాత్రనే
దీనతఁ బల్కఁ బాడియె సుధీజనులెల్ల హసింప? నెందు నే
నేనుఁగు నెక్కి చక్క నవనీశ్వర! శక్యమె దిడ్డి దూఱఁగన్. 113

చ. అను వినుతాంగిపల్కులు దినాధిపవంశపయోధిపూర్ణిమా
ఘనజవిరోధి యెంతయు నవారితమోహనిబద్ధచిత్తుఁడై
విని యొకయింత సొమ్మసిలి వేగమె తెప్పిరి యోనెలంత! యి
ట్లన గతి గంటిఁగాక తగదా మది నీక్రియ నూహసేయుటల్? 114

క. ఆడినమాట తగ న్విడ, నాడక కైకొన్నమాత్ర నకటా మదిలో
నోడక విటునిరువను నీఁ, బాడియె సువివేక ముడిగి పంకజగంధీ! 115

తే. పద్మదళనేత్ర! ని న్నెడబాసి యొక్క, నిమిషమేనియు నోర్వఁగ నేర్చు టెట్లు?
పరమసాధ్వివి ని న్నిట్లు పల్కినట్టి, తప్పు క్షమసేయుమా మది దయదలిర్ప. 116

క. ఈయెడ నింతయు నానతిఁ, ద్రోయక గైకొంటి వెమ్మెతో మఱి యెందున్
నీయట్టిసతులు గలరే, వేయాఱులలోననైన విమలేందుముఖీ! 117

ఉ. చంచలనేత్ర! నామదికి సమ్మతిగా నిపు డొక్కమాట యూ
హించి దయ న్వచింపుము మహిం జిరకీర్తు లనేకభంగులన్
నించు నటంచుఁ బల్కుటయు నీలమధువ్రతవేణి నేరుపు
ల్మించఁగ నన్నరేశుని లలిం గని యిట్లనెఁ బ్రోడజాడలన్. 118

తే. క్షితిప! యిటుల విచారంబు సేయుచుండి, చిన్నమాటలు పలుకంగఁ జెల్లదిదియుఁ
గాక మత్స్వాంతవృత్తియుఁ గనుఁగొనంగఁ, దలఁచితేనియు వినుము డెందమున నలర.

సీ. జననాథ! విను హరిశ్చంద్రావనీంద్రుండు గాధేయుకొఱకు లోకంబు తెలియఁగ
ధారుణీభారమంతయు వేగఁ బోనాడి తనపొలంతిని బుత్త్రి నొనర నమ్మి
మునుకొని యంత్యజన్మునివెంట మధుమాంసములు మోచుచును వానిఁ గొలుచుచున్న
వంత నవ్విభునిసత్యవ్రతంబున కాత్తఁ గరుణించి నిజభక్తవరదుఁ డైన
తే. కాశికావల్లభుఁడు జగత్కారణుండు, విశ్వనాథుండు చండికాధీశ్వరుండు
ప్రేమ సాక్షాత్కరించి యభీష్ట మొసఁగి, కావఁడే వారి నత్యంతకౌతుకమున! 120

క. నీ వాడినవాక్యం బిపు, డేవిధమున నైన నిర్వహించిన దానన్
భావజదమనుఁడు కరుణం, బ్రోవంగలం డాత్మ నరసి భూవరతిలకా! 121

ఆ. భక్తి విడకయుండు భల్లాణ! యివ్వేళ, మది దృఢంబుమీఱ మట్టుపఱచి
సేయుకార్య మిఁకను జింతింపవలవదు, నాకు నైనఁ గడువినమ్రగతిని. 122

సీ. అను ఘనజఘనఁ గన్గొని యను జనపతి విను వినుతాంగి! శోభనత దనర
నీచిత్త మరయంగ నీచందమున నొత్తి చూచితి నిజమది చోద్య మలర
నిరుపమహృదయంబు లేకమై యుండినఁ గోర్కులన్నియు నొనఁగూడఁగలవు
మొనసి నిన్నీవేషమున నొసంగినయప్పు డవ్విటవరుఁడు క్రోధాత్ముఁ డగుచు
తే. వారకామిని దేకిటు లూరిలోన, వరుని నెడబాసి యొంటిమై సరవి నున్న
యట్టిమగనాలిఁ దెచ్చి తీసనుచు నొల్ల, కాజ్ఞ యొనరింపఁగలఁ డమితాగ్రహమున.

క. కావున నిన్నీరూపము,తో విటశేఖరునికడకుఁ దోడ్కొనిచనఁ గా
దీవేళ వేశ్యకామిని, నై వేగమె రమ్మటంచు ననిచినయంతన్. 124

క. అంతిపురి కరిగి యయ్యాలి, కుంతల వెలయింతి యగుటకుం జనుచున్నన్
అంతం గని యొంతేనియు, సంతసమున మల్లికాంబ సపతికి ననియెన్. 125

శా. కల్లల్గావు విరాళిఁ గొన్నవిటజంగం బంగనం గోరచో
నుల్లం బెల్లను బల్లవింప నను నీ నొప్పింప కోచల్లమా
భల్లాణక్షితిపాలశేఖరునకుం బట్టంపుఁబూఁబోఁడి వై
చెల్లంబో యిటువంటిమక్కువనిపను ల్సేయంగ నీ కర్హమే? 126

క. ఓయప్ప వారకామిని, గా యిప్పు డలంకరించి కర మొప్ప మనో
నాయకునికడకుఁ దోడ్కొని, వే యరుగఁగదమ్మ నన్ను వికచాబ్జముఖీ. 127

తే. అనెడుకూరిమిసవతి నెంతేనిఁ గరుణ, మీఱ నవ్వారిజాక్షి తా గారవించి
పలుకు నిట్లని యోముద్దుకలికి మేలు, చెలఁగి నీబుద్ధి వేవేలు సేయఁజాలు. 128

ఉ. నీరజగంధి నీవనుచు నే ననుమ న్మది భేద మెద్దియు
వ్వారికతంబునన్ వ్రతము పంచన నొందకయుండి భక్తి యొ
ప్పారినఁ జాలు నీవ చను మాత్మ గ్రహించి చిపుపట్టు లుండఁగా
నేరవు కామశాస్త్రగతి నిక్కము మెఱుంగవు ప్రోల వారయన్ 129

క. ఇభరాజయాన యును ని, విభుకౌఁగిట మెలఁగుచుం ము విభముంతయుఁ గా
దభినవవిలాసుమశర, నిభుఁ డయ్యతి రతిరహస్యనిపుణుఁడు సుమ్మీ! 130

ఉ. చొక్కులఁ దక్కుల న్నిగుల సొంపగు తేటమిటారిచూపులన్
జక్కనిమందహాసములఁ జారువిలాసముల న్సలీలఁ బెం
పెక్కుడుదివ్యవాసనల నింపగుతియ్యనిముద్దుపల్కుల
న్నిక్కపువారకాంతకరణిన్ వలపింపవలె న్భుజంగునిన్. 131

తే. మఱియునసమాస్త్రశాస్త్రప్రమాణసరణిఁ, దవిలిపురుషాయితాదిబంధములయందుఁ
బ్రౌఢ వై కూడవలయు నేర్పునఁ జెలంగి, పల్లవునియుల్లమెల్లనఁ బల్లవింప. 132

క. అటుగాక హృదీశ్వరుచెం, గట నే నియ్యకొని వచ్చి క్రమ్మఱ నిపుడో
కుటిలాలక! నిన్నంపినఁ, బటుషైఖరి వలుకఁడే నృపాలుఁడు చెప్పుమా? 133

తే. అని సవతి నూరడిలఁ బల్కి మాత్రుణంబ, చల్లమాదేవి తుది లేనిసంతసంబు
దనరఁ బతిహితమునకునై తానె వేగ, మున నలంకృతి యొనరించుకొనఁదొడంగె.

తే. సుందరులు గొందఱప్పు డయ్యిందుముఖికిఁ, గుందనపుబిందియలయందు బొందుమిగుల
నెంచఁగలిగినపన్నీరు నించి చాల, నంద మొప్పార జలకంబు లార్చి రోగిని. 135

క. ఉడురాజవదన యొక్కతె, తడియొత్తె న్రాజసతికి ధౌతాంబరముల్
నడిచాల్చె నొకతె సొగసుగఁ, గడువేడుకతో నొకర్తు కాంతామణికిన్. 136

ఉ. సొంపుగ నింద్రనీలమణిశోభల నేలఁగఁ జాలి సోగలై
పెంపెసలారుముంగురులఁ బెద్దయుఁ గ్రొమ్ముడి దిద్ది దిక్కులన్
ముంపుచుఁ బెంపుమీరెడుసమున్నతదివ్యసుగంధయుక్తమౌ
సంపెఁగదండఁ జుట్టె నొకసారసనేత్ర నృపాలపత్నికిన్, 137

ఉ. ముద్దులగుమ్మ యోర్తు చెలిముందఱ గొప్పమెఱుంగుటద్దముం
దద్దయు నిల్పె నొక్కవనితామణి కస్తురిబొట్టు మోమునం
దిద్దెఁ బడంతి యోర్తు సొరిది న్మకరీసుమరేఖ లెంతయున్
ముద్దియతళ్కుఁజెక్కులను మోహనలీల లిఖించె నేర్పునన్. 138

చ. కలువలఁ గేరుచంద్రముఖికన్గవ నొక్కవధూలలామ చె
ల్వలరఁగఁ గజ్జలం బిడియె నజ్జనిభానన యోర్తు వేడ్క రం
జిలఁగను నీలవేణి జిగిసిబ్బెపుగుబ్బలపైని జొబ్బిలం
గలప మలందె నంచితసుగంధయుతంబుగఁ జిత్రవైఖరిన్. 139

సీ. చారుముక్తాహారవారము గ్గళమున నించె వేడుక నొక్కమించుబోఁడి
సౌవర్ణకర్ణభూషణము లందముమీఱఁ దగిలించె నొకశీతధామవదన
ఘన మైనపచ్చలకడియంబు లిరవుఁగాఁ బెట్టెఁ జేతుల నొక్కబిసరుహాక్షి
కమనీయరత్నసంఘటిత మై చెలువొందుమొలనూలిడియె నొక్కమోహనాంగి
తే. పాదములనందియలుబెట్టెభామయొకతె, నుదుటఁజేర్చుక్కనిడెనొక్కసుదతిమఱియుఁ
వేఱుగలభూషణములెల్లఁ బ్రేమ నిడిరి, రమణు లింపార నప్పు డారాజసతికి. 140

వ. ఇట్లు గన్యాశృంగారధారిణి యై యనంతరంబ. 141

సీ. ఘనసారచందనకస్తూరికాముఖ్యదివ్యగంధంబులు దిశలఁ బర్వఁ
గింకిణీనూపురక్రేంకారనాదము ల్కడునింపుమీఱ నొక్కటఁ జెలంగ
ఘనరత్ననికరసంఘటిత మై తనరారు నవ్యకాంచనభూషణములు మెఱయ
భూరికుంతలబంధభారంబుచే మించి మంద మై నడకలు సందడింపఁ
తే. బీనకుచకుంభయుగళంబు పేర్మిఁ బొదల, లలితశృంగారలీలావిలాసములను
వాసి మీఱంగ నమ్మహీవరునికడకు, నింతి యరుదెంచె మదనునిదంతి యనఁగ. 142

క. ఈరీతి నతులతరశృంగారము దనరారవారకాంతయుఁ బోలెం
జేరి తనయెదుట నిలిచిన, నారీమణిఁ జూచి ధరణినాథుఁడు వేడ్కన్. 143

క. ఈలలనారత్నం బీ, నీలాలక యీవినిద్రనీరజముఖి యీ
లీలావతి తను నొందన, పాలిటిజంగమున కంచుఁ బ్రణుతించి వెసన్. 144

తే. భూమివిభుఁ డంతఁ దన కుంతిపురము వెడలి, నెలఁతఁ దోడ్కొని యరుగుచో నింగినుండి
చూచి సురకాంత లెంతయుఁ జోద్యమంది, యెల్లవారును దమలోన నిట్టులనిరి.

సీ. ధారుణీశ్వరుబుద్ధి పూరి మేసంగెఁబో సరగ నెం దుండియో జంగ మొకఁడు
చేరి వారాంగనఁ గోరినతఱి నియ్య గొనకొని యిచ్చుటఁ గొఱుపకాని
తనభక్తి చెడకుండఁ బనిపడి వేశ్యగా నిల్లాలిని నొసంగె నిట్టిచిత్ర
మెప్పుడు ననువార లొకకొందఱును భళా చాన యొక్కఁతె యైన మానవేంద్రుఁ
తే. డేటికి నొసంగు ముద్దియ లిద్ద ఱగుటఁ, జేసి వారలు తమలోనఁ జెలఁగి పోరు
చున్నఁ గన్గొని యిపు డిచ్చుచున్నవాఁడు, గాని నిక్కంపుభక్తి కాఁగలదె యిటుల?

క. ఇచ్చిన నిరుపుర నొక్కట, నచ్చం బగుభక్తితోడ నర్పింపక యీ
కుచ్చితములు తగ వనుచున్, మెచ్చక యొకకొంద ఱేమిమే లనువారున్. 147

చ. పురములు వాహనంబులును భూషణము ల్ధనధాన్యము ల్సువాం
బరములుఁ బాఁడిధేనువులుఁ బ్రార్థనసేయక జంగమయ్య యే
తెఱఁగున వేశ్యఁ గోరె! నతిధీరత నట్లతఁ డింతిఁ గోరినన్
ధరణిపుఁ డెట్టు లియ్యకొనెఁ! దా నని పల్కెడువారు కొందఱున్. 148

క. ఇయ్యకొని వారసుందరి, యెయ్యెడలం గన్గొనున్న నిల్లాలి నిటుల్
చయ్యన నొసఁగుట ఘనతయొ, యియ్యిలపతి కనుచుఁ గొంద ఱెన్నెడువారున్.

సీ. ఆసరోరుహనేత్రయైనఁ గా దన కిట్లు పతివెంట వేశ్యయై భవ్యగతిని
జనినంత భక్తియే యనువారు కొందఱు గట్టిగా భక్తిమార్గంబు పూని
నప్పుడే భక్తుండు చెప్పినవిధమెల్లఁ జేసిన నిల్లాలు సేయకున్న
నదియుపో చిత్రం యనువారు గొందఱు సతికి భర్తకు నొక్కమతియ యైనఁ
తే గల్గు నభిమత మిది కల్ల గాదు నృపుఁడు, లీల నీజంగమునకు నిల్లాలి నొసఁగి
హరుని మెప్పించి బొందితో నరుగఁగలఁడు, సరగఁ గైలాసమునకెల్లజనులు నెఱుఁగ.

క. అనువా రొకకొందఱు నై, కనుఁగొన నవ్వేళ నృపతి కాంతామణిఁ దో
డ్కొని చని యలజంగమునా, యనిసన్నిధి నునిచి యిట్టు లనియెం బ్రీతిన్. 151

క. తగుచిగురుబోఁడిఁ దెచ్చితి, నొగి మీకుఁ బరిగ్రహింపుఁ డోసామి! యనన్
నగుమొగ మలరఁగ నపు డ, జ్జగతీపతితోడ యోగిచంద్రుఁడు బల్కెన్. 152

తే రమ్ము భల్లాణ నిక్కంపురాజ వనుచు, నెమ్మదిని జాల నీమాట నమ్మియుంటి
నెంతదడవయ్యెఁ బడఁతిఁ దే నేగి యిపుడు, పూని నీయోజయొంతైన మానఁగలదె?

క. రంగుగ జంగమువిటుఁ డను, చుంగడు నిబ్భంగిఁ జులకఁ జూచితొ తలఁపన్
వెంగలివి భూప! నీ కే, సంగతి వలరాదు మానసము నామీఁదన్. 154

సీ. కామాంధకారి నైనకడఁకతో నీరాకఁ గాచుచుండఁగ మూఁడుకన్ను లయ్యెఁ
దలమేలు బరువయ్యెఁ దగ మేను సగమయ్యె గళమూలమునఁ జందునిలుకడయ్యె
వలనొప్ప మునుకటివగ దప్పె వలపును విరిగెను నడురేయి సరవి నయ్యె
నా కేటి కీ వేశ్య నీ కేటి నిజభక్తి బూటకంబులచేతఁ బ్రొద్దుగడపి
తే. నాఁడవింతియుఁ గాక భూనాథులెచట?, వ్రతము లెచ్చట? ఘనశైవమతము లెచట?
నెందుఁ గొఱగానిపొలఁతుక నిటులఁ దెచ్చి, యందుకొమ్మనువారెందునైనఁ గలరె.

వ. అని వెండియు నిట్లనియె. 156

తే. అనవలసి నిన్ను నిటువలె నంటిఁ గాక, తగునె వేశ్యలతోఁ బొందు తాపసులకు?
వలసితివి భూప! మాకునై యధికముగను, దీనిఁ గైకొమ్ము నీవైనఁ బూని యిఁకను.

సీ. అనువిటవరునిఁ గన్గొని వినయోక్తి నిట్లను మనుజాధీశుఁ డనువుమీఱ
నయ్యలు మీ రెట్టులాడినఁ దగుఁ గాక క్షితి నయ్యలకుఁ దెచ్చు చిగురుఁబోండ్ల
నవ్వులుగాఁ జూడ నర్హంబు మాకును దవిలి మీ కిట్లాడఁ దగునె మమ్ము?
నాఁకలి గొన్నచో నన్న మెవ్వరికైనఁ గలిగిన నిడి నాడఁ గాదు సుమ్ము
తే. మీ మదికి సంతసంబైన మీనవేత్ర, నరయుచుండంగఁ దడవయ్యె నయ్య యింకఁ
దప్పు లెన్నక కైకొమ్ము తరుణి నిపుడు, కరుణ నని భక్తి నడుగుల కెరఁగుటయును.

క. నృపతిఁ గృపఁ జూచి యప్పుడా, కపటపువిటజంగమయ్య కడునవ్వుచు నో
తపనకులవర్య! ఓయఁగ, నిపు డాడితిఁ గాక సాటి యేరీ నీకున్. 159

ఉ. కావలె నన్నమాత్రమునఁ గౌతుకముం జెలు నాఁగాను రా
జీవదళాక్షిఁ దెచ్చితివి చెన్నలర న్బదివేలు సేయు నీ
భావజుచేతిమేలినునుబంగరుబొమ్మను ముద్దుగుమ్మ న
జ్జీవునకు న్విధాతకును శేషునకుం దరమే నుతింపఁగన్? 160

క. ముద మొదవఁగ నజచందురుఁ, గదుమఁ దివురును విదనుగురు కడుఁ బొదలెడుతు
మ్మెదకొదమకదుపుఁ జెదరఁగ, నదలించు న్సుదతి మృదువులౌ పెన్నెరులన్.

క. వాసిగ నీసుదతీమణి, నాసము నాసమమె యంచు నవగంధఫలి
న్భాసురగతిఁ గన్గొని సరి, హాసం బొనరించు సంతతాంచితలీలన్. 162

తే. చెలఁగి జగములు గెలువంగఁ దలఁచియిడిన, మరునిబలుసింగిణీవిండ్లు తరుణిబొమలు
కడఁక నవ్వింటఁ బూన్చినకలువతూఁపు, లీపయోజాననమిటారిచూపు లరయ.

క. చిగురాకు కెంపుబింబము, పగడంబును జెందిరమును బంధూకము ని
మ్మగువయధరమ్ముతోడుతఁ, దగునే తుల యనఁగ నెట్టితావుల నైనన్? 164

క. పలువరుస మొల్లమొగ్గల, పలువరుసలఁ గెల్వఁ జాలు భామినినును జె
క్కులు తళుకుటద్దములతోఁ, గలహించుం దొమ్మిదులను గళము తెంచున్. 165

తే. చెలువపలుకులు గండుఁగోయిలల నేలు, నెలఁతచిరునవ్వు లేఁతవెన్నెలల నవ్వుఁ
గలికికంఠంబు క్రముకంబు నలరు భిన్న,ములుగఁ గావించు నెంతయుఁ జలముమీఱ.

చ. పరువడి నంచితంబు లగు బాహుమృణాళములొప్ప గొప్ప లై
యఱుతను వ్రేలుమౌక్తికపుహారములంచులఁ జీరలాడఁగా
గుఱుతుగ నవ్వెలందికుచకుంభయుగం బలరు న్మనస్సరో
వరమున సంభవించి చెలువం బగుతామరమొగ్గలో యనన్. 167

సీ. నుసునల్లచీమబారును గేరు నూఁగారు వళు లబ్ధివీచికావళుల నేలు
నిసుకతిన్నియలతో వెసఁ బోరుఁ బిఱుఁదులు కరితుండములనెగ్గులరయుఁ దొడలు
మెఱయుకాహాళలతో మొనయును జంఘలు పాదయుగ్మము కచ్ఛపములఁ దోలు
నఖపంక్తి పలుమాఱు నగుఁ దారకంబుల నడలు రాయంచలఁ దొడరి యెంచు

తే. మేలిమిపసిండిచాయల గేలిసేయుఁ, బూని నిక్కంబుగా దీనిమేనికాంతి
యెందు నిటువంటిచెలు వైనయిందువదన, కలదె పరికింప మార్తాండకులవరేణ్య.

క. అని వనిత నెంచి యాగురు, వను నోజననాథ ! నీగృహమునకు మముఁ దో
డ్కొని చను వేగమ యిఁకఁ ద, డిక్కనతావులు వలదను మ్మొగిన్ మా కనుడున్.

క. నరపతి వల్లె యని య, గ్గురునకుఁ గైదండ యిడుచుఁ గొమరొప్పఁగ నా
యిరువురఁ దోడ్కొని తనమం, దిరమునకుం దెచ్చి యునిచి తిర మగుభక్తిన్.

గీ. అర్ఘ్యపాద్యాదు లొసఁగి ప్రహర్షుఁ జేసి, యిలు వెడలివచ్చితగఁ దనవెలఁదికనియెఁ
గలికి! యిన్నాళ్ళు నాయక్కుఁ గౌఁగిలించు,పరుసనీజంగమయ్యకీవలయుఁ జొమ్ము.

క. కాదేని దునియలుగ నడి, మోఁదెద నని చేత ఖడ్గముం బూని మహా
హాదమున నుండె నొకదరి, నాదిత్యకులాంబునిధిశశాంకుఁడు పేర్మిన్. 172

ఉ. అయ్యెడఁ జల్లమాంబ విభు నానతిఁ గైకొని వాఁడిచూపు లొ
య్యొయ్యన మీఱ లేనగవు లొప్పఁగఁ జెక్కులఁ బొఱితీవిమైఁ
బయ్యెదజాఱ ముద్దునుఁ బల్కులు చెల్వలరార నవ్విటుం
జయ్యనఁ జేరి మ్రొక్కి నెఱజాణగు పెల్ల నెఱింగి రంగుగన్. 173

క. చెఱకులు గొబ్బరియును శ,ర్కరయుం బాలును ఘృతంబు కలపంబులునున్
నెఱి ఫలరసాన్నములు గ్రొ,వ్విరులు న్గడునొసఁగి యంత వేడ్కలుమీఱన్. 174

గీ. పండుటాకులుకపురంబుబాగములును, ముత్తియఁపుఁజూర్ణమునుగూర్చిముగ్ధవిడెము
చుట్టిరొసఁగుచుఁ బవళించి సుభగలీల, నున్నయద్దేవుచరణంబు లొత్తుచుండె.
క. పరిభాషింపఁగఁ జూచిన, మఱి యావిటుఁ డించుకైన మాటాడక సు
స్థిరముగ నుండిన వమ్మద, కరిగామిని యతనితోడఁ గడువడి ననియెన్. 176
సీ. ఏవిచారములేక యిటు లున్నఁ జెంతను జేరిన మే లేమి వారసతికిఁ
బల్కరించిన మాఱుపల్కవు మూఁగలాగున రతిసేయంగఁ గోర విపుడు
సిగ్గుచేఁ బోరియంగ శివుప వింతయుఁ గావు కడురూఢి నున్నావు గండుమీఱి
యిత్తఱి నీకింత మెత్తతనం బేల జాగు మానుము ప్రొద్దు చాల నరిగెఁ
తే. బురుషుఁ డొగిఁ జేయి సేయకే పొలఁతిచేయి, చేయరాదనిచూచినఁ జెలఁగియున్న
కొదువ లెన్నఁదలంచియో గుట్టుతోడ, నున్నవాఁడవు? నీ కిది యొప్ప దనఘ! 177
చ. సరసము మీఱఁ గేరుచును శయ్యకుఁ దారిచి కౌఁగిలించి సు
స్థిరముగ మోవి యాని నునుఁజెక్కులు గోళుల నొత్తి లీలఁ బ
ల్మఱు మరుకేళిఁ గూడి చెలిమానసముం గఱఁగింపకున్న నె
న్నరు నరు లింతయు న్మగతనం బని పూని భుజంగపుంగవా! 178
క. అగుఁ గాని లె మ్మటంచుం, జిగురాకుంబోఁడి యతనిఁ జెనకినఁ దా ని
మ్ముగ లేవక స్థాణు వనం, దగియున్నమహాత్ముఁ జూచి తనలో ననియెన్. 179
చ. శివశివ! సేవయెంతయును జేసినఁ గైకొనుఁగాని యీవిట
ప్రవరున కించుకేనియును బొఱుదు మోహము నెమ్మనంబునం
దవి లిపు డెంత లె మ్మనుచుఁ దా బతిమాలిననుం గఱంగఁ డీ
భువిఁ జలికూటిపై నిడినఁ బొం దలరా రెడువెన్నకైవడిన్. 180
సీ. నిక్కవంబుగఁ దూర్పుదిక్కువెల్వెలఁబాఱెఁజక్కనొక్కటవేఁగుఁజుక్కపొడిచె
దామ్రచూడంబులు తవిలి కూయఁదొడంగెఁ జదలున నుడులు తేజంబు తప్పె
జారచోరాదులసంచారములు వాసెఁ గమలాప్తుఁ డుదయించుసమయ మయ్యె
నిపు డైన మరుకేళి నిచ్చ సేయఁడు మంకుజంగ మివ్విటచిహ్న చనునె యెందు?
తే. నీశ్వరా యెట్టిచిత్రంబొ యిది! యటంచుఁ, దత్తరింపక విభునిచిత్తంబుగాను
బలిమినైనను గామింతు నలర నితని, ననుచు విరిపాన్పుపై నెక్కె యవ్వధూటి.
సీ. ఘనతరంబుగ దీపకళికలు నల్గడ వెలుఁగఁ గప్రపుధూపములు చెలంగఁ
గాంచి సమంచితఘంటానినాదము ల్మోయఁ బుష్పాడి భూతికరణిఁ దనరఁ
బరిమళాదులవింతబాగులు చెలువార సొగసుపల్కులు శివస్తోత్రములుగ
నలర సన్మణిగణంబులు హారతులలీల నమరంగ ఫలరసాన్నములు చాల

తే. లింగనైవేద్యములభంగి రంగుమీఱ, నతివ శివరాత్రి చేసెడుగతిని దనర
దేహ మభవున కర్పింపఁ దివిరి యపుడు, కరయుగము చాఁచి తుదిలేని కౌతుకమున.

క. ఆలింగని నొనరఁగఁ దా, నాలింగనమునకుఁ దివియ నమ్ముద్దులప్రో
యాలింగని మెచ్చి హరుం, డాలో నెంనాళ్లబాలుఁ డై తగ నిల్చెన్. 183

తే. శంభుఁ డాచల్లమాంబహస్తములలోన, నివ్విధంబున బాలుఁడై నివ్వటిల్లి
యవ్వేలందుక మదిగట్టిదనుచు నోలిఁ, జనులఁ జేఁపూర వాపోయెఁ జన్నుఁగుడువ.

సీ. అది విని చాటున నొదిగియున్న నృపాలుఁ డనె సతి కద్భుతస్వాంతుఁ డగుచుఁ
బోలఁతిరో! యిది యేమి పుట్టుగో ప్రాఁ వై యున్న దానికిఁ జోద్య మొప్ప నిట్లు
శిశువు వాపోయెడిఁ జెప్పు మటంచుఁ దా లోపలి కేగక లోఁతు దెలియ
నడిగిన నిట్లను నవనీశ! కంటివా మెచ్చుగా మిండఁడై వచ్చినట్టి

తే. యొడయఁ డిప్పుడు బాలుఁడైయుండి పోఁగులు, మన్నవాఁడనఁ గ్రమ్మర నువిదతోడఁ
దరణివంశాంబునిధిశీతకిరణుఁ డైన, ఘనుఁడు భల్లాణధారుణీకాంతుఁ డనియె. 185

క. బాలుని కివ్విటపద్ధతు, లేలా వల దనుచుఁ జెక్కు లిరుగడ నొనరన్
వ్రేలుమునువేసిఘృతమును, బాలును బోయుము చెలంగి బాలేందుముఖీ! 186

తే. నావుడు లతాంగి యిట్లను భూవరేణ్య, పాలు ద్రావఁడు కొట్టంగఁ గేలు రాదు
మూఁడుకన్నుల నలరి యున్నాఁడు చూడ, నితరులకుఁ జెల్ల దివ్వింత యింతయైన.

తే. అనుడు నృపుఁడింతిఁదోడితెమ్మనియొడయని, నివ్వలికిమూఁడుకన్నులయీశ్వరుండు
పెట్టిగోట్లను జేసి నన్ వేశ్య నడిగి, కొసరి మనభక్తి దెలియంగఁ గోరెనిటుల. 188

క. అనుటయు బాలునిఁ దోడ్కొని, యనితోరత్నంబు వేగ ద్వారము వెడలన్
ఘనుఁ డాశంకరుఁ డంతట, మునుపటితనచిఱుతచందములు మానె వెసన్. 189

సీ. జడలలో మిన్నేఱు జాబిల్లిసికపువ్వు పులితోలు నునుశూలు పునుకసరులు
చేత ముమ్మొనవాలు చిలువసూడిగములు నొసటమిక్కిలికన్ను విసపుఁగుతుక
వెలిమిడి మెయిపూఁత తెలిగిబ్బ తత్తడి సగమేన గట్టులసామిపట్టి
మొగమునఁ జిఱునవ్వు మిగులఁ గూరిమిచూపు వన్నెమీఱెడుపాఁపజన్నిదములు

తే. నలర నలువయు వెన్నుండు నఖిలసురులు, మునులు ప్రమథులుగొల్వసమ్మోదమునను
భవుఁడు సాక్షాత్కరించెఁ గృపాసముగ్రుఁ డగుచు భల్లాణు నెదుట నత్యద్భుతముగ.

తే. అవ్విధంబునఁ బ్రత్యక్షమైనయట్టి, యవ్విరూపాక్షుఁ గాంచి సాష్టాంగ మెఱఁగి
ముదముతోడుతఁ గేల్దోయి మొగిచి యనని, నాయకుండిట్టులనినుతి సేయఁదొడఁగె.

చ. జయ జయ నీలకంఠ! పురశాసన! శంకర! ద్విడ్భయంకరా!
జయ జయ శాంభవీరమణ! చంద్రవిభూషణ! భక్తపోషణా!

జయ జయ దేవదేవ! మదసామజభంజన ! యోగిరంజనా!
జయ జయ ఫాలనేత్ర! విలసద్గుణమండన! దైత్యఖండనా. 192

లయగ్రాహి. నారదతుషారకరపారదపటీరతరశారదవిశాలతరనీరదనిభాంగా!
వారణాసురాహితవిదారణ! జగద్భరణకారణ! మహాభయనివారణ! భృతైణా!
సూర! గణనాథ! శ్రుతిపారగ! జగన్నుత! ఘనోరగవిభూష! రిపుహార! గరళాంకా!
సారసభవార్చిత! సుధీర! సముదంచితకృపారసనమగ్ర! ఘనసారసమహాసా. 193

దండకము. జయ గిరిశ! సురేశ ముఖ్యామరస్తోమమాళిస్థిత స్నిగ్ధచామీకరోదగ్ర రత్నప్రయుక్తావతంసప్రభాసంచయాంచత్పదాంభోరుహా! భక్తలోకామరోర్వీరుహా! హారనీహార కర్పూర డిండీరమందార గోక్షీర హారావళీ చారుకీర్తిప్రకాశా! మహేశా! కపర్దాంచితేందుప్రభామండలప్రస్ఫుటద్దివ్యకల్లోలినీకైరవేందీవరా! ధీవరా! గ్రావరాట్కన్యకాచారువక్షోరుహద్వంద్వలిప్తాంగరాగప్రదీప్తోరువక్షోంతరా! సంతతోద్యత్సరోజాతజాతాండభాండోదరా! భూతివేదండ చర్మాంబరా! తాండవాడంబరా జంభజిద్రత్నశోభావిడంబోజ్వలత్కంఠ హాలాహలా! వాలఖిల్యాదియోగీంద్రహృత్పంకజేందిందిరా! సుందరాకారా! లోకైకవీరా! సువర్ణాద్రిధీరా! భుజంగేంద్రహారా! మహోదార! వారాశిగంభీర! నారాయణస్తోత్రపాత్రాంచితానందచారిత్ర నీదివ్యచారిత్రముల్ శ్రీశ వాగీశ భోగీశ దేవేశులున్ వర్ణనల్ సేయఁగాఁజాలరే నెంతవాఁడన్ మహామూఢుఁడన్ నీవు కారుణ్యభావంబుతో నన్ను రక్షింపనూహింప నీరీతిఁ బ్రత్యక్షమైనిల్చి బ్రహ్మాదులున్ సిద్ధయోగీంద్రులున్ గానలేకుండు నీపాదకంజాతయుగ్మంబు వీక్షింపఁగాఁ జేయుటం జేసి నేధన్యతం జెందితిన్ బూని లోకంబులున్ సత్పదార్థంబుఁగానంగలేకుండు చందాన నత్యంతమాయాంధకారంబుచేఁ జిక్కినిం గానఁగాలేక దైవంబు లంచున్ వడిన్ దాఁ బనెల్లన్ సమర్చించియుం దేమియున్ మేలునొందంగలేకుంటు రెంచన్ ఘనుల్ గొంత తిమ్మైనసుజ్ఞానదీపంబు దీపింపఁగాఁ జేసి తత్వంబునుం గాంచి వాంఛార్థముల్ గొందు రానందలీలన్ చిదానందునిన్ గొల్చి ముక్తికాంతామణిం జెంది శశ్వద్విభూతిం బ్రకాశించుచున్నట్టిసద్భక్తసంఘంబులంబోలె నన్నుం గృపాదృష్టి నీక్షించి రక్షింపు మీశా! విరూపాక్షశా! పాపౌఘనాశా! నమస్తే నమస్తే నమః 194

క. ఇచ్చెద నేవరమయినను, హెచ్చుగఁ బ్రార్థింపు మిప్పు డిమ్ముగ మీతో
నెచ్చుట నైనం దుల యన, నచ్చు నిజం బైనభక్తవరు లిలఁ గలరే? 195

చ. అడిగిన లేదటంచు విడనాడక నీదగుభక్తి చక్కఁగాఁ
గడుఁ గడముట్టఁ జేసితివి కౌతుకముం జెలువార మేలు నీ

పడఁతిని వారకాంతఁగను బ్రౌఢి నొసంగితి నన్నసంశయం
బుడుగుము ధారుణీతలవరోత్తమ ! నిక్కము మానసంబునన్. 196

తే. సుతుఁడ నైయుంటి నీ కిపు డతులితముగ, జనకుఁడవు నీవు నీసతి జనని మాకుఁ
దిరముమీఱంగ నమ్మహాదేవితోడ, సాటిసున్న ధరిత్రీశ ! నేటుసేయు! 197

చ. అని కృపఁజేసి శంభుఁ డపు డంబిక కిట్లను నోవెలంది! యి
య్యినకులనాథుచంద మిపు డిమ్ములఁ గనుఁగొంటె ! నేను వే
శ్యను వెసఁ గోర నియ్యకొని సద్గణికాంగన గల్గునన్నచోఁ
దనకులకాంతనే యొసఁగెఁ దథ్యముగా వెలయింతి బాగుగన్. 198

క. ఇతఁ డింతవిరహయోగుం, డితనికి మనలోక మిప్పు డిత్తమె యనినం
బతిపల్కులు తగ విని పా, ర్వతి దా నిట్లనియె మిగులఁ బ్రమదముతోడన్. 199

సీ. ఇందుకిరీట ! నీ కేభక్తవరుఁడైనఁ బ్రాణం బొసంగును భాగ్య మొసఁగుఁ
దలఁ దెంచి యొసఁగును లలిఁ దనూజునిఁ గూరఁగా వండియొసఁగునుగాని యిటుల
మానంబు దిగనాడి మానిని నీరాదు మాన మిచ్చుటఁజేసి మానవేశుఁ
డధికనిశ్చలభక్తుఁ డత్యంతసజ్జనుం డితనికి మనలోక మీయవలయు

తే. ననిన శర్వాణిపలుకుల కలరె నభవుఁ, డంతమునులును బ్రహ్మాదు లభినుతింపఁ
దొగలు ముకుళింపఁ బద్మముల్ తగ వికసింప, దరణి యుదయాద్రిపైఁ దోఁచెఁ దత్క్షణంబ.

సీ. దివి నప్సరోజనుల్ దవిలి నృత్యంబాడఁ గర మొప్ప గంధర్వపతులు పాడ
సకలదేవతలును బ్రకటించి పొగడంగ శుభలీల దివ్యదుందుభులు మ్రోయఁ
బుడమి నెల్లెడలను బుష్పవర్షం బొప్ప నరు లెల్లఁ దల్లత్తి యరసిచూడ
భళ్ళాణధరణీశుభామల నిరుపమభద్ర విమానంబుపైని వేడ్కఁ

తే. దనర నెక్కించుకొని కడు ఘనతమీఱఁ, బూని భల్లాణుతో జగంబులనుతింపఁ
దనర వృషభేంద్రు నెక్కి భూతలమునుండి, భవుఁడు వెంచేసెఁ గైలాసభవనమునకు.

సీ. అనిన నయ్యీశ్వరుం డానందచిత్తుఁ డై గౌరియుం దానును ఘనతతోడ
భళ్ళాణభూపాలుఁ బ్రమథులలోఁ బెద్దఁ గాఁ జేసి పట్టంబుగట్టి మిగుల
మంగళగీతంబు లంగనల్ వెసఁ బాడ శంఖాదిరవములు సరవి మ్రోయ
నిరుగడ బ్రహ్మాదిసురలు సేవింపంగఁ బ్రమథగణంబులు బలిసి కొల్వ

తే. రమణతోఁ దానె తగ పరబ్రహ్మ మగుచు, జగములన్నియు నేలుచు శాశ్వతముగ
రత్నసింహాసనస్థుఁడై రాజసమున, నవిరళం బగుసుఖలీలఁ దవిలి యుండె. 202

సీ. అనుచు సూతుఁడు నైమిశారణ్యవాసులై యలరుచుండెడు శౌనకాదులకును
రమణీయబసవపురాణోక్త మైనయీ భల్లాణరాయభూపాలచరిత

వినిపించు క్రమమును బనిమీఱ నా నేర్పువిధమున రచియించి విమలభక్తి
దనర మీ కొసఁగితిఁ దగ మీర లిందులతప్పుల క్షమచేసి దయదలిర్ప
తే. నిమ్మహాకావ్య మెప్పుడు నిద్ధరిత్రి, నేర్పుతో విస్తరిల్లి బుధేంద్రులెల్లఁ
బొగడ నాచంద్రతారార్క మగుచునుండు, నటులనొనరించి సుమ్ము ప్రోవుమయ్య శర్వ !
క. నరవరులకుఁ గృతు లిడి యి, ద్ధరణిం గవివరులు సంపదలఁ బొందుదు రా
నెఱి నిహపరసుఖములకై, యురుబుద్ధిని నీకుఁ గావ్య మొసఁగితి నభవా! 204
క. ఈకథఁ జదివిన వ్రాసినఁ, బ్రాకటముగ వినినయట్టి భవ్యులకెల్లన్
శ్రీకరముగ నభిమతములు, చేకురఁగాఁ జేసి కరుణఁ జేయు మనంతా. 2;5
వ. అని యివ్విధంబున విన్నవించి. 206
క. కరతలధరితకురంగా!, చిరతరకరుణాంతరంగ! సింధునిషంగా !
కరిదనుజమదవిభంగా!, గురుజనహృత్పద్మభృంగ! కుక్కుటలింగా. 207
మణి. మురహరశరవర! మునిజనశరణా!, సురవరవరద! కుసుమశరహరణా !
చిరతరగుణ! విలసితకరహరిణా!, పరమపురుష! నిరుపమశశిభరణా! 208
మాలిని. సదమలతరరూపా ! సర్వలోకప్రదీపా !
ముదితబుధకలాపా! ముఖ్యసత్యానులాపా !
విదళితఘనతాపా ! విశ్రుతోద్యత్ప్రతాపా!
కదనతలసకోపా! కాంచనాహార్యచాపా! 209

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వర ప్రసాద లబ్ధ కవితా సామ్రాజ్య ధురంధర ఘనయశో బంధుర కౌండిన్యగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర బుధజనవిధేయ తిమ్మయ నామధేయ ప్రణీతం బైన రాజశేఖరవిలాసం బను మహాకావ్యంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. —1921.

# ఆంధ్రగ్రంథములు.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| రుక్మిణీపరిణయము, కూచిమంచి జగ్గకవిది | ... | 0 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| అప్పకవీయము, నూతనముద్రితము | ... | 2 | 8 |
| ,, విమర్శనముమాత్రము | ... | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలు కాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము. | | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతుల కన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | ... | 8 | 0 |
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | | |
| 7 సంపుటముల ప్రతి | 1-కి రూ. | 15 | 12 |
| 3 సంపుటముల ప్రతి | ... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| అరణ్యపర్వము ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు,, | ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 4 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, | ... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి | ... | 0 | 8 |
| భోజరాజీయము, నూతనముద్రితము | ... | 1 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| బ్రహ్మోత్తరఖండము ... | 1 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు ... | 0 | 12 |
| ,, కాలికోబైండు ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటిపాపరాజప్రణీతము, చక్కనికూర్పు ... | 2 | 4 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము ... | 1 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 4 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితము ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువుకృతము ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 10 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనముమిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము ... | 7 | 8 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము ... | 1 | 4 |
| డిటో ద్వితీయభాగము ... | 1 | 6 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు ... | 1 | 0 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.